# హనుమప్ప నాయకుడు

తిరుమల కృష్ణదేశికాచార్యులు

ప్రచురణ




రిజిస్టర్డు సంఖ్య : 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

HANUMAPPA NAYAKUDU

A Telugu poetic work in a classical style about a great hero of yester years of Telugu country by Sri Tirumala Krishna Desikacharyulu, Dept. of Atomic Energy, Canada.



ప్రచురణ సంఖ్య : 118

ప్రథమ ముద్రణ : జనవరి 1986

ప్రతులు : 1200

ముఖచిత్రాలంకృతి : సుధామ

ముద్రణ : సువర్ణ ముద్రణాలయ,
నల్లకుంట, హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ : శ్రీ బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
5. కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : 30/-

# పద్యవిద్యలో హృద్యప్రయోగం

మిత్రులు శ్రీ తిరుమల కృష్ణదేశికాచార్యులు రచించిన 'హనుమప్ప నాయకుడు' కావ్యాన్ని వారు చదువుతుంటూనే మొదట విన్నాను. ఎంతో ఆసక్తిని పొందాను. ఆ తరువాత స్వయంగా చదివాను ఆశ్చర్యాన్ని పొందాను. అలనాటి ప్రబంధకవి ఆధునికయుగంలో ప్రయోగశక్తిలో ప్రభవించినట్లు తోచింది. ఆచార్యులవారు వృత్తిరీత్యా ఖగోళశాస్త్ర సంబంధియైన ఉద్యోగాన్ని చేపట్టారు కొంతకాలం, ఆ తరువాత గణనశాస్త్రంలోకి మారారు. ఖగోళం వైపు చూచే శాస్త్రజ్ఞుడు భూగోళంతోపాటు బహుగోళాల ప్రవృత్తులను పరిశీలించి వివేచించి చెప్పవచ్చు. మరి ఖగోళ శాస్త్రజ్ఞుడైన కవి ఖగోళంవైపు చూస్తే భావుకుడు, శాస్త్ర కవి కాకతప్పదు. శ్రీకృష్ణదేశికాచార్యులు ఖగోళాన్ని చూచినట్లే శబ్దగోళాన్ని కూడా వ్యుత్పత్తితో, శాస్త్రదృష్టితో చూచారు; అర్థగోళాన్ని భావుకమైన దృష్టితో, అలంకృతమైన వాగ్వృత్తితో పరిశీలించారు. శబ్దార్థపుష్టికల ప్రజాకవి వారిలో ప్రవృద్ధి చెందాడు; పండితకవిగా పరిపక్వతను సాధించాడు. గణన శాస్త్రం వారిలో అక్షరమాత్రాగణ గణనంలో ఎన్నో వినూత్నధోరణులను మేల్కొల్పింది గణనంలో మాత్రమే గురుతులుగా నిలిచి గణనలోనికి రాని ఎన్నోరకాలైన ఛందాలను దేశికాచారిగారి మనోనేత్రం దర్శింప గలిగింది. సందర్భోచితంగా వాటిని ప్రయోగించే ప్రజ్ఞ వారిలో పరిణతి చెందింది. కోకొల్లలుగా క్రొత్త ఛందస్సులు ఈ కృతిలో లాస్యంచేస్తూ రంగప్రవేశం చేశాయి. తెలుగు పద్యరంగంలో 'దయానా' వృత్తం ఈకృతిలోనే మొదట దాబుగా నడుస్తున్నది; 'నయాగరా' వృత్తం జలపాతంలా జాలువారు తున్నది; 'ఓల్గా' వృత్తం వల్గనం చేస్తున్నది; 'ఊర్మిళా' వృత్తం ఊపిరి పీలుస్తున్నవి ఇక ఖండ, చతురస్ర, మిశ్ర, త్ర్యస్ర గతుల్లో వివిధ మాత్రాఛందాలు మనోవిలాసాలను వెలారుస్తున్నవి. సీసతుల్యాలు, కందతుల్యాలు, ద్విపద తుల్యాలు అయిన పద్యాలు క్రొత్తవేషాలతో, నూత్న గతులతో సహృదయులను సమ్మోహపరుస్తున్నవి. ఆచార్యులవారిని ఖగోళశాస్త్రం భావుకుడైన శాస్త్రకవిగా తీర్చింది; గణనశాస్త్రం ప్రయోగవాది యైన ఛందో

మర్మజ్ఞునిగా దిద్దింది. ఈ ఉభయ వ్యక్తిత్వాల సంగమ తీర్థం 'హనుమప్ప నాయక' కావ్యం.

"సంచల త్ఖురచతుష్క సముత్థితోత్కట
క్షోదంబు సూర్యునకు గూడు కట్ట" ( చూపు. పు. 98)

వంటి సీస పద్యాలు చదివితే కృష్ణదేశికాచార్యు లేప్రబంధకవికీ తీసిపోరని పిస్తుంది. అశ్వవర్ణనం ఇంత నిపుణంగావేసి పింగళిసూరనను మరపింపచేశారు. ఆచార్యుల వారిలో మరొక విశేషం ఉంది. ఆయనకు శబ్దం వశవర్తి. ఆయన పాండిత్యం అటువంటిది. అమరం నుండి ఆంధ్రనామసంగ్రహందాకా పద్య నిఘంటువులు ఆయన జిహ్వాగ్రంమీద నేటికీ జీవిస్తున్నాయి. అంతేకాదు ఆయనకు ప్రతి శబ్దానికీ వ్యుత్పత్తి తెలుసు. అందుచే ఆయన కవితలోని శబ్దం అర్థశక్తి తెలిసి ప్రయోగించింది; పఠితకూడా అటువంటి వ్యుత్పత్తితోనే చదువుకొని ఆనందింపదగింది. ఈ కావ్యంలో గద్వాలసోమనాద్రి యొక్క గుఱ్ఱానికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. గుఱ్ఱాన్ని సూచించే శబ్దాలెన్నో ఉన్నాయి.

"ఘోటకే వీతి తురగ తురం గాశ్వ తురంగమాః
వాజి వాహార్వ గన్ధర్వ హయసైన్ధవ సప్తయః"

అని అమరం ఈకవి దాదాపు ఈ శబ్దాలన్నీ ఆయాసందర్భాల్లో వాడారు. ఊరక వాడటం కాదు. సార్థకంగా సప్రయోజనంగా సరసంగా వాడారు.

"ఆయుత్తమాశ్వంబు నధిరోహ మొనరించి
ఉచ్చైశ్శ్రవంబును వియచ్చరుల పతియట్లు" (పుట 99)

ఇందులో సోమనాద్రి భూపాలుణ్ణి ఆకాశయానం చేయగలిగిన దేవతలకు పతియైన ఇంద్రుడితో పోల్చటం జరిగింది. అతవి గుఱ్ఱాన్ని ఉచ్చైశ్రవంతో పోల్చటం జరిగింది. ఈ ఉపమానాలకు తగినట్లు ఉపమేయాలను సముచితంగా చెప్పాలి. అందుకే అశ్వశబ్దాన్ని వాడతారు ఆచార్యులవారు. 'అశ్నుతే గమనేనేత్యశ్వః అశూ వ్యాప్తౌ' గమనము చేత వ్యాపించునది' అని అశ్వమునకు వ్యుత్పత్తిని చెపుతున్నది గురుబాల ప్రబోధిక. వియచ్చరులపతి వంటి రాజెక్కే గుఱ్ఱం గమనంచేత వ్యాపించేదిగానే ఉండాలి. ఆగుఱ్ఱం నేలమీద నడుస్తూ గాలిలో ప్రాకుతున్న

ట్లుంటుంది. ఇక్కడ ఉన్నట్లే ఉండి అన్నిచోట్లా చకచక్కితంగా వెలుగొందు తున్నట్లు వ్యాపిస్తుంది. అనే భావన ఆశబ్దశక్తివలన పఠితహృదయంతో స్ఫురింప చేయటం కవిధ్యేయం ఇలా చెప్పుకుంటూపోతే, ఈకావ్యంలో చాల పద్యాలకు విపులమైన వ్యాఖ్య వ్రాయవలసి వస్తుంది. వీరిపద్యవిద్య 'విద్వానేన విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అన్నసూక్తికి విలువైన ఉదాహరణం.

శ్రీ దేశికాచార్యులు కథకు కల్పనలను ఆమ్రేడితాలుగా చేయగలరు; సంద ర్భానికి చక్కని వర్ణనలను సార్థకంగా సంవదింపగలరు. హనుమప్ప నాయకు డీకావ్యంలో ప్రధానపాత్ర. ఆయన కాపేరు ఎందుకు వచ్చిందో చరిత్ర చెప్పదు; సురవరం ప్రతాపరెడ్డి గారు తమకథలో చెప్పలేదు. దేశికాచార్యులు వ్రాస్తున్నది కావ్యం. కార్య కారణ సంబంధమైన కల్పన కవి కార్యం. అందువలన హను మత్ప్రసాద సంజనితునిగా నాయకుణ్ణి చెప్పారు. అలాగే ఎన్నో కల్పన లీకథలో ఉన్నాయి. మూలకథ 'ఖాళీలు పూరించండి' (Fill in the blanks) అని ఇచ్చిన ప్రశ్నలాగా ఉంది. కావ్యకథేమో ఖాళీలుపూరించి కమనీయంగా కూర్చిన వాక్యంలా ఉంది. అంతేకాదు 'వాక్యం రసాత్మకంకావ్యం' కూడా.

శ్రీదేశికాచార్యులు పిల్లగాలిని సైతం అల్లరిగా వీవనీయరు. కావ్యర్థ నంద నంలో సాభిప్రాయంగా సాగవలసిందే.

"తుంగభద్రానదీ తోయమ్ములన్ మంగ
  ళాభ్యంజన స్నానమాచరించి
వలమాన సంపతిత పత్త్రసంఘాతమున్
  మేల్పట్టు పుట్టముగ మేనగట్టి
నవజాతకంజాత నివహమ్ము నందముగ
  నవరత్నమాలగా సవదరించి
పరిఫుల్ల సురభిళ ప్రసవ పాంసూత్కరము
  భద్రాత పత్రముగ, బాదుకొల్పి
కల్కికల్యాణ సుముహూర్త కాలమందు
సర్వసర్వం సహారాజ్య సార్వభౌమ
పదవి నభిషక్తుఁడా రాచపట్టి మాడ్కి
గర్వయుతుఁడౌచు గమియించె గంధవహుఁడు." (పు. 161)

మలయానిలుడు అభిషిక్తుడైన యువరాజులాగా రాణిస్తూ గంధవహుడయ్యాడు. అభిషేకోత్సవానికి వచ్చే రాచపట్టి అభ్యంగనస్నానం నుండి ఆచరించే మంగళ కార్యాలను ఇందులో పొందుపరచడమే కాకుండా, భావికథార్థవ్యంజకంగా వర్ణనను నిబంధించటం విశేషం. శిల్పం తెలిసిన కవి చేసే జిలుగుపని యిది. ఆచార్యులవారికి ఈవిద్య కరతలామలకం.

'హనుమప్పనాయకుడు' కావ్యంలోని శైలినిగురించి ఒక మాటచెప్పాలి మొదట్లో కృష్ణదేశికాచార్యుల కలం సంస్కృత శబ్దాలను, సమాసాలను ఎక్కువగా వరించింది. కావ్యం చివరిభాగానికి వచ్చేసరికి క్రమంగా అచ్చికపదాలను ఎక్కువగా వాడటం అలవాటు చేసికొన్నది. మార్పు సహజం.

"మాటలు పెక్కు లేటికి? అమానుషవీరుడు సోమనాద్రి మా
మోటలు మాని మా విభుని మ్రోలకు నిప్పుడె పంపగా దగున్
మాటల పొంకముం గలుగు మానిసి నొక్కని సంధిసేయ, సం
స్ఫోటము మాన్పి యస్మదసువుల్ పరిరక్షణ సేయుగా నొగిన్"(పు.167)

తత్సమ బహుళంగా వ్రాసినా, అచ్చిక పద బహుళంగా వ్రాసినా దేశికాచార్యులు 'మాటలపొంకముంగలుగు మానిసి! మాటల పొంకమే ఈ కవి కైతకు జీవం.

పాశ్చాత్యదేశంలో నివసిస్తున్నా మాతృ భారతి మాధుర్యాన్ని మరచిపోని మనస్వి శ్రీమాన్ తిరుమల కృష్ణదేశికాచార్యులు. తాను విన్నభాషలు, నేర్చిన భాషలు, వారికి తెలుగుమీద గౌరవాన్ని మరీ మరీ పెంచాయి. తెలుగుకు ప్రపంచ భాషలలోనే గణనీయమైన ఒక ప్రత్యేకత ఉన్నదని చాటుతున్నారు ఆచార్యులవారు.

"అత్వమోఘమౌ విశ్వసాహిత్యవనము
లోన, దెల్గు పూలకు సరిలేని వింత
సౌరభంబుల, రంగుల నేర్చికూర్చి
తమ్మ! నీకెంత ప్రియమమ్మ యాంధ్రులన్న"

అని భారతిని ప్రశంసించారు. దేశదేశాలూ తిరిగిన దేశికాచార్యులు చెప్పింది అనుభవ సత్యం. విశ్వసాహిత్యవనంలో తెలుగుపూల రంగులొక వింత, వాసనలు మరొక వింత. విశ్వభాషలందు వెలుగు తెలుగు.

విద్యార్థిదశలో చదువు కొన్న ఒక వీరగాథ, విద్వత్కవి హృదయంలో బీజం మహావృక్షమైనట్లు ఒక ప్రౌఢ కావ్యంగా రూపుదాల్చింది సురవరంవారి కథలోని శక్తి తిరుమలవారి ఉక్తిలో కావ్యకల్పకంగా మారింది. ప్రతాపరెడ్డిగారి హనుమప్పనాయుడు వీరుడైన యోధుడు; కృష్ణదేశికాచార్యుల వారి నాయకుడు వీరరసమూర్తి యైన కావ్యనాయకుడు. వస్తువును బట్టి ఈ కృతి చారిత్రకకావ్యం కవితనుబట్టి ఈ కృతి ప్రబంధం; ఛందః ప్రయోగాలను బట్టి ఈ కృతి విలక్షణ ప్రయోగకావ్యం; ప్రబోధకవితాచ్ఛాయ లిందులో ఉండటంచేత కొంత నవీనకావ్యం: కాలానికి సంబంధించి ఇది ఆధునిక కావ్యం.

కావ్యంలోని వస్తువు ఎంత ప్రాతదైనా అందులో కవియొక్క ఆత్మీయత కొంత ప్రతిబింబింపకపోదు. గద్వాల ఆస్థానంలో ప్రతి మాఘమాసంలోను విద్వద్గోష్ఠులు జరుగుతుండేవట. వాటిని కథలో కల్పన కనుగుణంగా దేశికాచార్యులవారు చేర్చి వర్ణించారు. మూలంలో ఈ వివరాలు లేవు. కవివాటిని కల్పించి కథలో చొప్పించారు. ఆకవులలో ఆచార్యులవారి ఆత్మీయతకూడా ప్రతిఫలించింది.

"విరులతో మాలకరి వివిధమౌ హారముల
విరచించుగతి సుధావిమల మధురోక్తులను
విరచింతు రాశువుగ వరకావ్యముల వారు
కురిపింత్రు నవపద్యకుసుమమ్ములను వారు (పు. 69)

వారి సంగతి తెలియదు కాని, వారిగుణములన్నీ తిరుమలదేశికాచార్యులకున్నాయని మాత్రం మనకు తెలుస్తుందీ కావ్యం చదివితే. పదములకూర్పు ఆచార్యులవారి నేర్పు; మాధుర్యగుణం వీరి కవితా సౌందర్యం; కొన్ని కవితలు ఆశు లక్షణాలను, కావ్య కవితా లక్షణాలనూ సంతరించుకొని ఉండటం ఈకవి ఉభయ కావ్య కళా కౌశల్యం. నవపద్యాలనే కాక నవపద్య ప్రయోగాలను కూడా అందించటం ఆచార్యులవారి ప్రతిభాపాటవం.

ఈ కావ్యం చదువుతూ ఉంటే మెదడుకూ, మనసుకూ ఏతాం వేసినట్లుంది. పాండిత్యస్ఫూర్తితో పదాలు రాజసంగా నడుస్తూ రాణిస్తాయి; సౌజన్యస్ఫూర్తితో అర్థాలు సరళంగా ప్రసవిస్తూ సహృదయాన్ని కలిగిస్తాయి. ఈకావ్యం ఒక చిత్రమైన

సృష్టి. ప్రబంధంలాగా ఉండే పసందైన కావ్యం; గేయకావ్యస్వభావాన్ని సంపదించుకున్న పద్యకావ్యం; చారిత్రక సత్యాన్ని ఆధారంగా చేసికొని వెలసిన మిశ్రకావ్యం; ఛందఃప్రయోగ ప్రదర్శనకు ప్రాముఖ్యమున్నా భావస్పందనకు ఛందాన్ని ప్రయోగాత్మగా వాడుకున్న హృద్యమైన పద్య కావ్యం. దీనిని రచించిన కవి "భారతీకృపా వరవిదితాంధ్ర వాక్సరణి పైపవుడు". ఆయనకు ఆంధ్రావళి పక్షాన అభినందనలు!

జి.వి. సుబ్రహ్మణ్యం

# మనామాట

## హనుమప్ప నాయకుడు

ఉత్తమలక్ష్యాన్ని సాధించడానికి, ధర్మబద్ధమైన కర్తవ్యాన్ని నిర్వహించడానికి ఉత్కటమైన ఉత్సాహంతో ఉద్యమించడం ఇతివృత్తంగా ఉన్న కావ్యమే నాటికి నేటికి ఆదర్శప్రాయంగా ఉంటున్నది. పురాణగాథలు, రామాయణ భారతేతిహాసాలు, ధర్మరక్షణకోసం, దేశరక్షణకోసం మాతృదేశ దాస్యవిముక్తికోసం, తమ జీవిత సర్వస్వాన్ని ధారవోసిన మహితాత్ముల వీరసాత్మకములే. ధర్మవీరరస సంభరితములే. ఈ ధర్మవీరుల భవ్యచరిత్రలు రచయితలకు ఉపాధేయాలైనప్పుడే రచనలకు సార్థకతచేకూరుతుంది. పఠితల హృదయాల్లో ధర్మాభిరతి అంకురిస్తుంది. పురాభారతీయుల్లో దైవత్వమర్యాదల నందుకున్న మాహనీయుల పవిత్రజీవితాలు అజరామరకావ్యాలుగా అవతరించి సర్వభారతీయుల రసనాగ్రాల పై లాస్యం చేస్తున్నవి. సర్వభారతీయ హృదంతరాళాలలో వాసనారూపంలో పదిలంగా ఉంటునేఉన్నవి. నిన్నటి మొన్నటి భారతేతిహాసంలో అధర్మప్రభంజనాన్ని అడ్డుకున్న మేరునగధీరులు రాణాప్రతాప్, శివాజీ, ఝాన్సీలక్ష్మీబాయి, రాణీచెన్నమ్మ, వీరపాండ్య కట్టబొమ్మన్, భగత్‌సింగ్, వీరసావర్కార్, మహాత్మాగాంధీ, అల్లూరి సీతారామరాజు, ఆంధ్రకేసరి ప్రకాశం వంటివారెందరో ! చరిత్రకెక్కని చరితార్థులెందరో ! మనకింకా తెలియని అజ్ఞాతవీరులెందరో !

చిలకమర్తి లక్ష్మీనరసింహం, కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, సురవరం ప్రతాపరెడ్డి, మల్లంపల్లి సోమశేఖరశర్మ వంటి సాహిత్యవేత్తలు, పరిశోధకులు దేశచరిత్రను తమా వీరగంధంతో సురభిళితం చేసిన ధీరులగాథలను రాతిపలకలనుంచి, రాగిరేకులనుంచి, ప్రాచీన గ్రంథాలనుంచి, ఇతరభాషా గ్రంథాలనుంచి వెదకితీసి మనకు అందించిన మనీషులు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి "హైందవ ధర్మవీరులు" అనే గ్రంథంలో ఒక పతిహిత ఆంజనేయుడైన వీరుడు హనుమప్పనాయకునే సాహసగాథ ఉన్నది. ఈ "హనుమప్ప నాయకుడు" కావ్యానికి అది మూలమైంది.

ఇప్పుడు పాలమూరు (మహబూబ్‌నగరం జిల్లా)లో ఒక తాలూకాగా ఉన్న గద్వాల స్వాతంత్ర్యానికి పూర్వం హైదాబాదు సంస్థానాధీశుడైన నిజాంకు లోబడిఉన్న తెలుగు సంస్థానంగా ఉండేది. విజయనగర సామ్రాజ్య కాలంనుంచి

గద్వాల సంస్థానానికి చరిత్రవుంది. హైందవ సంస్కృతి పరిరక్షణలో గద్వాల ప్రభువులుకూడా శక్తివంచనలేకుండా పాటుపడినవారే. హైద్రాబాదు నిజాం ఆంధ్రదేశంలో నిలదొక్కుకుంటున్న కాలంలో గద్వాల ప్రభువులు స్వతంత్ర ప్రతిపత్తికోసం, ధర్మరక్షణకోసం, తెలుగు సాహిత్యంకోసం ఆదరాభిమానాలతో కృషిచేసిన చరితార్థులు. ఆ గద్వాల రాజుల్లో సోమభూపాలుని కాలంలో జరిగిన గాథ ఈ "హనుమప్పనాయకుడు" ఇతివృత్తం.

ఈ కావ్యాన్ని అందమైన ఛందస్సుల్లో పొదిగి, చక్కని తెలుగు నుడికారంతో కైసేసి, ప్రబంధ కవితాపథంలో నడిపించి తమ కావ్యరచనానైపుణ్యాన్ని ప్రదర్శించినారు మిత్రులు శ్రీ తిరుమల కృష్ణదేశికాచార్యులుగారు. ఆయన చదివింది సాంకేతికశాస్త్రం. ఎలక్ట్రానిక్స్, కంప్యూటర్ సైన్స్. కాని సాహిత్యంపట్ల అభిరుచినే గుండెల్లో పదిలపరచుకోగలిగిన ధన్యులు. సుదూరదేశం కెనడాలో మంచి ఉద్యోగంలో ఉన్నారు. కంప్యూటర్ ద్వారా తెలుగులిపి సంస్కరించి తెలుగు ముద్రణను నిర్దుష్టంగా, సుందరంగా తీర్చిదిద్దడానికి పరిశోధనలూ, ప్రయోగాలూ చేస్తున్నారు తీరికవేళల్లో.

పాలమూరు జిల్లాలో అచ్చంపేట తాలుకలో బల్మూరు గ్రామానికి చెందినవారు శ్రీ దేశికాచార్యులు. సత్సంప్రదాయాలకూ, వైదుష్యానికీ అంకితమైన పండితవంశం ఆయనది. శ్రీ దేశికాచార్యుల సౌమనస్యం, పాండిత్యం, భారతీయ సంస్కృతి సాంప్రదాయాలపట్ల ఆయన అలవరచుకున్న శ్రద్ధాసక్తులు మా "యువభారతీయు"లనెంతో ముగ్ధుల్ని చేసినవి. ఆయన వ్రాసిన ఈ కావ్యాన్ని మాప్రచురణగా, వెలయించాలనుకున్నాము. ఈ పట్టున మాతో హార్థికంగా, ఆర్థికంగా పరిపూర్ణ సహకారం అందించిన శ్రీ దేశికాచార్యులుగారికి, ఆయన బంధు బృందానికి మా ధన్యవాద పరంపరలు.

శ్రీ దేశికాచార్యులకు ఆశీస్సులనందించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారికి మా అభివందనములు. కావ్యాన్ని పరిచయం చేసిన మా ప్రధానసంపాదకులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికి వందనములు. కావ్యకర్తను అభినందించిన శ్రీ శ్రీరంగాచార్యులుగారికి మా కృతజ్ఞతలు.

ఇరివెంటి కృష్ణమూర్తి

18-1-1986

అధ్యక్షులు.

యువభారతి.

# ఆశీస్సులు

శ్రీమాన్ తిరుమల దేశికాచార్యులవారు రచించిన హనుమప్పనాయుడు కావ్యము నాద్యంతమునాదృతిమై పఠించి ఆమందానంద భరితాంతఃకరణుడ నైతిని. వారు విదేశములలో నున్నప్పటికి మాతృభాషను విస్మరింపక పాండితీ మండితము, వీరరసభరితము, సర్వాలంకారశోభితము, మహనీయవస్తుకము, షడాశ్వాససంపన్నమునైన మహాకావ్యమును రచించిరి. తురుష్కులు వంచనచే హరించిన గద్వాల సోమనాద్రి భూపాలుని విజయకారణమైన వాజిరాజమును చొప్ప అమ్మువాని వేషమున తురుష్క స్కంధావారమునకేగి తెచ్చి ప్రభుభక్తి పరాయణుడైన హనుమప్పనాయని సాహససంపన్నమైన యుదంతమిందలి వస్తువు. కీ.శే. సురవరము ప్రతాపరెడ్డిగారు హైందవధర్మవీరులను గ్రంథమున నీకథను సంగ్రహముగానైనను సరసముగా తెల్పియుండిరి. శ్రీమాన్ ఆచార్యులవారందుండి కథను గ్రహించి సముచిత వర్ణనాదులతో పెంచి యీ మధురకావ్యమును రూపొందించిరి.

హనుమప్ప హనుమత్ప్రసాద సంజనితుడు. సార్థక నామధేయుడు. తొల్లి సముద్రమును లంఘించి అశోకవనమందున్న సీతామహాసాధ్విని దర్శించి యామె క్షేమవార్తను తెచ్చి రామచంద్రుని కృతజ్ఞతకు పాత్రుడైన హనుమంతునివలెనే హనుమప్పయు తురుష్కాపహృతమైన సోమనాద్రి హయరాజమును తెచ్చి ఆమహారాజు కృతజ్ఞతకు పాత్రుడయ్యెను. ఈవిషయమును కవిగారు మూడునాల్గుచోట్ల స్ఫురింపజేసిరి. సోమనాద్రి గద్వాల రాజ్యమును ధర్మమార్గమున పాలించుచు గద్వాలను కళాకేంద్రముగ ఆంధ్రభూమి కలంకారమునైన నగరలలామముగ నొనరించెను. అదిచూచి ఉప్పేడుసరదారుడు సయ్యదు ఈర్ష్యాళువై గద్వాలపై దండెత్తెను. ఉక్కుతునుకలవంటి ఆంధ్రవీరులా తురుష్కసైన్యముల నోడించిరి. సయ్యదు సాటి నవాబుల సాయమునేగాక నైజాముప్రభువు సాహాయ్యముకూడ నర్థించెను. వారందఱుకూడ సోమనాద్రి నోడింపలేకపోయిరి. అప్పుడాతని విజయమున కాతని అశ్వమే మూలమని

తురుష్కులు దానిని హరించి గూఢముగా నశ్వశాలలో కట్టివైచిరి. సోమనాద్రి వంతకంతము లేకపోయెను. అతడు నిండుకొలువులో తన అశ్వమును తెచ్చిన వానికి ఆ అశ్వమతివేగముగ నొకదినములో తిరిగినంత భూభాగమును బహూకరింతునని ప్రకటించెను. యోధులొండరుల మొగములు చూచుకొనుచుండ హనుమప్ప ఆసాహసకార్యమునకొడిగట్టి ప్రాణములకు కూడ తెగించి ఆ ఆజానేయమును గొనితెచ్చెను. దానిని తెచ్చుటలో నతడు ప్రదర్శించిన కౌశలమును, ధైర్యమును, రాజభక్తియు నాన్యతోదర్శనీయములైనట్టివి.

కవిగారు స్వల్పపరిమాణముగల కథను రమ్యములైన అనేక వర్ణనలతో పెంచియుండిరి. హనుమప్ప నాయకుడగుటచే నతని తల్లిదండ్రుల నియమవ్రతాదులను చక్కగా వర్ణించి యుండిరి. చివరికి హనుమంతుడనుగ్రహించెను. భద్రగజతేజము హనుమప్ప తల్లి గర్భమున ప్రవేశించిన వృత్తాంతము మహనీయుడైన గౌతమబుద్ధుని జననోదంతమును స్మృతికి దెచ్చుచున్నది.

ఇందలి బహువర్ణనములను వివరించుటలో కవిగారు ప్రదర్శించిన లోకపరిశీలనయు, కవిసమయపరిజ్ఞానమును, పూర్వకావ్యపరిచయమును విస్మయావహములుగా నున్నవి. వసంత హేమంతర్తువులు, హనుమంతుడు, కృష్ణాతుంగభద్రా తరంగిణులు, గద్వాలయందలి విద్వద్వ్రతంసులు, సోమనాద్రి కళావైదుషీ పోషణము, కేశవస్వామి ఆలయనిర్మాణము, యుద్ధము, తురుష్కయోధుల బీరములు, మద్యపానాసక్తి, వారితో హనుమప్ప చేసిన బేరము, హనుమప్పను గుర్తించిన పిమ్మట హయమొసరించిన ఉత్సాహపూరితమైన యలజడి - యిందలి వర్ణ్య వస్తువులలో ముఖ్యమైనవి. కవిగారు పైవానిని వర్ణించిన తెలుగు వానిని పఠితల కన్నులయెదుట సాక్షాత్కరింపజేయుచున్నది. వర్ణనలన్నియు సహజసుందరములై, ప్రౌఢములై, శబ్దార్థాలంకార శోభితములై కవిగారి పాండితీ ప్రతిభలనుపట్టి చూపుచున్నవి. వారిందు భక్తిని, వీరరౌద్రములను, కరుణమును, ఆయాసందర్భములందు హృద్యముగా పోషించి యుండిరి. రసపాత్ర పోషణమందు వారు చూపిన నేర్పు అప్రతిమాన ప్రతిభాపరిణతమైనట్టిది. వారుపమోత్ప్రేక్షారూపకాలంకారములను, అంత్యానుప్రాసములను వాడినతీరు వారి అపారపాండిత్యప్రాభవమును చెప్పక చెప్పుచున్నది.

కవిగారిందు సీసములను, కందములను, గీతములను పోలిన మాత్రా చ్ఛందమును వాడియుండిరి. కొన్నియెడల స్వకల్పిత నూత్నవృత్తములు, సుప్రసిద్ధమైన ఉత్పలచంపకమత్తేభాది వృత్తములు నున్నవి.

ఏఛందమును వాడినను వారు యతినోప్రాసనో విడిచియుండలేదు. ఇంక నాంధ్ర సంస్కృత పదములను ప్రయోగించుటలో వారు ప్రదర్శించిన పాటవము వర్ణనాతీతము. కొన్ని చోట్ల దీర్ఘ సంస్కృతసమాసములను వాడిరి. కొన్ని చోట్ల తియ్యని తెలుగు పల్కుల పొలుపు నొల్కించిరి. వారి రచన చూచిన పిమ్మట "ఈ పాండిత్యము నీకు దక్క మఱియెందేగంటిమే" అని అభిజ్ఞులనక మానరు. వారి భాష నిర్దుష్టము. పూర్వకవి మహాకావ్యవాక్య స్మారకము.

కవిగారీ కావ్యమును తమ తల్లిదండ్రులకంకితము కావించి తమ మాతా పితృభక్తిని చాటియుండిరి. దవిష్ఠమైన కెనడాదేశముననున్న కారణమున వారు వారికి తగినంత శుశ్రూష చేయలేకపోవుచున్నందుకు చింతించుచు నిరంత న్మానసానంద సంధాత్రిగా నీ కావ్యపాత్రిని పంపియున్నారు. వయసున పిన్న వారైనను శ్రీమాన్ దేశికాచార్యులవారు రచనచే, సద్గుణసంపదచే తమ నామ మును సార్థక మొనరించుచున్నారు. ఆంధ్రులు కెనడాదేశమునుండి యైనను వారినుండీ మహాకావ్యము నపేక్షింతురని సాదరముగా విన్నవించుచున్నాను.

దివాకర వేంకటావధాని

# అభినందన

తెలంగాణంలోని పాలమూరు జిల్లాకు సంస్థానాల జిల్లా అనేది ప్రసిద్ధి. ఏజిల్లాలో లేనన్ని సంస్థానాలు ఈజిల్లాలో ఉండటమే ఇందుకు కారణము.

పూర్వంనుండి నేటివరకు కూడా ఈ జిల్లాలో ఎందరో కవిపండితులు అనేకరీతులుగా సాహిత్యవ్యవసాయం చేస్తున్నారు. ఇట్టి వారిలో శ్రీమాన్ తిరుమల కృష్ణదేశికాచార్యుల వారున్నారు. గద్వాల సంస్థానం వర్ధిల్లిన రోజుల్లో శ్రీమాన్ ఆచార్యులవారి పూర్వులు తమ శాస్త్ర-కవితా-పాండిత్యాల వల్ల సంస్థానాధిపతి మన్ననలకు పాత్రులై - సత్కృతులు పొందిన విషయం - నేటికీ ఈ ప్రాంతంలో వినబడుతుంది.

శ్రీమాన్ దేశికాచార్యులవారు ఉన్నత విద్యావంతులై ఉద్యోగవశమున విదేశాల్లో ఉన్నతపదవి యందున్నారు. స్వస్థాన వేషభాషలను విస్మరింపక (విదేశాలలో నివసిస్తూ కూడ) మాతృభాషారాధన చేయటం ముదావహమైనట్టిది

ఎప్పుడో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసిన గద్వాల సోమభూపాలుని విషయము-హనుమప్ప వీరగాథలను పాఠ్యముగా అభ్యసించిన ఆచార్యుల వారు నేడు హనుమప్పనాయకుని చరిత్రమును వ్రాసి వారికిగల అభిమానమును వెల్లడించినారు.

నాగుర్తులో ఇప్పటివరకు హనుమప్పచరితను ఇంత వివరంగా వ్రాసిన వారు లేరు. గ్రంథకర్త పూర్వులు గద్వాల సంస్థానము నందున్నారు; ఈ కథ ఆ ప్రాంతనిది; కవి పాలమూరు జిల్లా వారు కావటం అన్నీ యాదృచ్ఛికం అయినవి. వీరి లేఖిని నుండి చక్కని కృతి వెలువడటం తెలుగు సాహిత్యానికి ఒక శోభ.

ఆచార్యులవారు ఇంతకు ముందు 'అశ్రుమాల' అనే గ్రంథాన్ని ప్రచురించినారు. వివిధ సందర్భాలలో వ్రాసిన రచనల సమాహారమైన ఈకృతి పెద్దల మెప్పుపొందినది. మొదటిసారి నేను అశ్రుమాలను చదివినప్పుడే ఒక మహాకావ్యము వీరినుండి రాగలదని భావించినాను. అట్టి భావన నేడు నిజమైనది

హనుమప్పచరితము మిక్కిలి చిన్నది. వీరరసోదంచితము. దీనిని గ్రహించిన ఆచార్యులవారు ప్రబంధ పద్ధతికవసరమైన వర్ణనల చేసి, సన్నివేశాలను కూర్చి, మరికొన్ని సన్నివేశాలను మార్చి కథా కథన శిల్పానేక రమ్యాభిరామముగా దీన్ని తీర్చిదిద్దినారు.

'అనౌచిత్యాదృతేనాన్య ద్రసభంగస్యకారణమ్
విరుద్ధంతత్పరిత్యాజ్య అన్యథావా ప్రకల్పయేత్-'

అనిగదా మనలాక్షణికాభిప్రాయము. కాబట్టి ఆచార్యులవారి మార్పులు - కూర్పులు సరసములు సమయోచితములు.

షడాశ్వాసపరిమితమైన యీరచన వీరరసముఖ్యమైనను, ఇతరరసములుకూడా పరిపోషింపబడి - సర్వాలంకార భూషితముగా - పాండితీమండితంగా సిద్ధంచేయబడింది.

ఈ గ్రంథాన్ని చదివినప్పుడు ఎన్నో ప్రయోగాలు, శబ్దాలు నూతనమైనవిగా స్ఫురిస్తాయి. ఆచార్యులవారికి గల బహుగ్రంథావలోకనానుభవంతో బాటు, సంస్కృత నిఘంటువులు, ప్రయోగ పరిశీలనయందు ఎంత ప్రగాఢమైన పరిశోధనానుభవము కలదో వెల్లడగును. వీరు ప్రయోగించిన కొన్ని శబ్దాలు మనకు వింతగా అనిపించి 'సిద్ధిర్లోకాత్ దృశ్యా'ను జ్ఞప్తి చేస్తవి.

ఆచార్యులవారీ కథను మిశ్రంగా చేసి కథానుగుణ్యమైన మార్పులను చేసినారు. హనుమప్ప నామము సార్థకమగుటకు కాబోలు ఇతడు హనుమద్వరప్రసాద సంజనితుడైనాడు. గద్వాల రాజులు నిర్మాణము చేయించిన హనుమదాలయాలు నేటికీ ప్రసిద్ధంగా ఉన్నవి. కపి - హనుమంతునకు హనుమప్పకు స్వామికార్య నిర్వహణలో అభేదత్వాన్ని నిరూపించడం సముచితం

గానే గాక - కథా కథనంలో ముఖ్యమయింది. ఈవిధంగా మార్పులను చేసిన గ్రంథకర్త వర్ణనల విషయంలో ఒక ప్రత్యేకతను నిరూపించుకొని 'వర్ణనా నిపుణః కవిః' అనేదాన్ని సార్థకం చేసినారు.

దీనిలో కృత్యాదియందలి భారతస్తవం, భారతీస్తవం ప్రత్యేక శ్రద్ధతో వ్రాయబడినవి. ఈ కథకు మూలము, ప్రేరణము, సురవరం వారి రచనకాబట్టి వారిని ప్రత్యేకంగా పేర్కొని - కాలంబని యెడి కాండపటంబున డాగిన యాంధ్రుల మూగచరిత్రను వెలికి తీసిన వారుగా-స్వభావోక్తిలో తెల్పటం వీరి కృతజ్ఞతాభావాన్నేగాక విద్యావినయాన్ని సూచిస్తున్నది.

కవిగారు ఈ గ్రంథాన్ని పలురకాలైన ఛందో భేదాలతో కూర్చినారు. వాటి ప్రత్యేకతలను - పద్ధతులను వారే వివరించినారు.

ఇట్టి గమకంతో కూడిన రచన ఉత్సాహంగా ఉండి ఉద్వేగాన్ని కలిగి స్తుంది (శ్రీ నారాయణరెడ్డిగారి కర్పూరవసంతరాయలు - నాగార్జునసాగరం, విశ్వనాథనాయుడు ఈకోవలోనివి).

ప్రాచీన రచనా సంప్రదాయబద్ధులైన ఆచార్యులవారు చక్కగా షష్ఠ్యంతా లను చెప్పినారు. 'ఖిలముగాకుండునది ధాత్రి కృతియె'గాబట్టి తమ మాతాపిత రులకు ఈకావ్యాన్ని అంకితం చేసి - భక్తి ప్రపత్తులను వెల్లడించుకొన్నారు.

ఆరు ఆశ్వాసాలలోను చక్కని వర్ణనలున్నవి. ఒకచోటపడిన హిమ బిందువును గూర్చి -

ఘోరయవనాధికారంబు గూలద్రోసి
ధర్మసంస్థాపనము సేయు మర్మమిదియె
యనుచు గూఢలిపి దెనుంగుజనులకజూడు
వ్రాసిపంపిన జాబులో వ్రాలునాగ
శాద్వలంబుల హిమబిందు సంఘమమరె.'

అని ఊహాతీతంగా వర్ణించి - వర్తమాన - భవిష్యత్ కథలను మొదటి రెండు పాదాల్లో సూచించినారు. దాని కుపబలంగా 'హిమబిందువులు' 'గూఢ లిపి'వలె ఉన్నవట.

ఎందరో కవులు మన నదీమతల్లులను తనివిదీర వర్ణించినవారే! కృష్ణాంకమైన కృష్ణానది వీరిదృష్టిలో కవితాత్మగా ప్రవహించుచున్నది నన్నయ శ్రీనాథ పోతనలు, అష్టదిగ్గజాల కావ్యసరణిలో మండిత పదర్కేంకారయుతమై ఆ నదీమతల్లి యొప్పారినది. నిజమే గద్వాల ప్రభువులనాడు కూడా ప్రబంధ ప్రౌఢవాసనానంపత్తి తరుగలేదుగదా! సోమభూమీధవునికొలువు కూటము

ప్రతివత్సర శిశిరాగత
వరపండిత కావ్యవధూ
రసవత్ స్ఫుర్శన రచితా
హ్లాద సుమాంచితచూతా!

అని - నందితిమ్మనార్యుని ప్రతివర్షవసంతోత్సవకుతుకాగతసుకవి నికరమును - స్ఫురింపచేసి, ఒకనాటి గద్వాల సంస్థానంలోని కవి పండితసదస్సులను, మాఘమాసోత్సవాలను పాఠకులకు జ్ఞాపకం చేసినారు.

భారతీయాత్మ - ఈ దేశం నాది. పవిత్రమైన నదీనదాలు - పర్వతాలు- ఇక్కడి మృత్తిక దైవస్వరూపాలు అనే విశ్వాసం కలది. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అని నమ్ముతుంది. అందుకే కవి - పవిత్ర మాతృభూమి రక్షణము చేయలేనివాడు వ్యర్థుడు. ఇట్టి వానిని తల్లి కనుటకన్న గొడ్రాలిగా ఉండుటే తగునని -

స్వల్పసౌఖ్యంబు లాశించి జన్మధాత్రి
బరులకర్పించి, లభియించెపాయసాన్న
మనుచు దనివొందు తనయులగనులకంటె
తెనుగుతల్లికి గొడ్రాలితనమె మేలు'

అనుచు ఉద్బోధిస్తున్నారు.

ఒక రచన నిలిచి అధీతిబోధాచరణప్రచారణముల పొందటానికి లోకుల రసనలె అకులుగావలెను. ఎన్నో పరీక్షలకు తట్టుకొని ఆ రచన నిలద్రొక్కుకొనవలెను. ఇట్టి భావాన్నే

పుట్టువొందుదు రెందరో పుడమియందు
కాని వారిలో నెవ్వండొ ఘనుడొకండు
త్యాగశౌర్యాభిరతిచేత దరతరమ్ము
లకు ఖిలముగాని జాడల రచన సేయు
కాలనిమ్నగా కూల సైకతములందు. (పు. 100)

అన్నారు. శతేషుజాయతే శూరః - కదా!

ఈ విధంగా దీనిలోని విషయాలను, కవిత్వాన్ని ఎంతగానో వివేచించవచ్చు.

విదేశాలలో ఉన్న శ్రీమాన్ దేశికాచార్యులవారు తెలుగును ఈసడించక, మరచిపోక, చక్కని కృతిని సాహిత్యలోకమున కందించుగ మిక్కిలి సంతోషము. శ్రియఃపతి వీరికాయురారోగ్యముల ప్రసాదించి భాషామతల్లికి సేవ చేయునట్టి భాగ్యాన్ని కలిగించవలెనని కోరుచు-ఈ మాటలు వ్రాసే అవకాశం కలిగించినందుకు నేను సంతోషించుచున్నాను.

పాలెం 509215
రక్తాక్షి ఆశ్వయుజ బహుళ సప్తమీ
బుధవారం, 17-10-84

భాషాసేవకుడు
శ్రీరంగాచార్య

# ప్రస్తావన

ఇది నా రెండవ కృతి. నా ప్రథమకృతి "అశ్రుమాల" అనే ఖండ కావ్యం. అశ్రుమాల ఇప్పటికి 13 ఏండ్ల క్రితం ప్రచురితమైంది. కాని అశ్రు మాలకు సూర్యావలోకనభాగ్యం కల్గిన మఱునాడే నే నున్నతవిద్యార్థమై కెనడా దేశం చేరుకున్నాను. అందుచేత అశ్రుమాలకు తగినంత వ్యాప్తి చేకూర్చటానికి నాకు శక్తి లేకపోయింది. అశ్రుమాల ముద్రణలో నుండగానే నేను "హనుమప్ప నాయక" కావ్యమారంభించి ప్రథమాశ్వాసాన్ని పూర్తిచేసినాను. కాని కెనడాలో ఉన్నతవిద్య, ఆతర్వాత ఖగోళశాస్త్రంలో పదవులకొఱకై ప్రపంచంలోని పలు దేశాల్లో పర్యటన, వీని మూలంగా రెండు సంవత్సరాల క్రిందటివరకు మళ్లీ సాహిత్యంవైపు చూచే అవకాశం నాకు లేకపోయింది. రెండు సంవత్సరాల క్రితం నేను ఖగోళశాస్త్రం నుండి గణనశాస్త్రం (Computer Science) లోనికి మారి, కెనడాదేశంలోని అణ్వింధనశాస్త్ర పరిశోధనావిభాగంలో (Atomic Energy of Canada) ఉద్యోగస్థుడనైనాను. ఈ మార్పువల్ల నాకు కొంత మేలు జరిగింది. జీవితంలో నిలుకడయేర్పడి, మళ్ళీ సాహిత్యవ్యవసాయ మారంభించడానికి వీలేర్పడింది. ఐతే నేను 13 సంవత్సరాల క్రిందట పూర్తిచేసిన హనుమప్ప నాయక కావ్యభాగం నా లోకాటనంలో ఎక్కడో పడిపోయింది. అందుచేత ఆదినుండి కావ్యం మళ్ళీ వ్రాయవలసిన పరిస్థితి యేర్పడింది. మొత్తానికి కడచిన రెండు సంవత్సరాల్లో తీరికవేళల్లో కూర్చొని ఆఱాశ్వాసాల కావ్యం పూర్తిచేసి పాఠకుల కందిస్తున్నాను. దీని బాగోగుల నిర్ణయానికి పాఠకులే ప్రాడ్వివాకులు.

నేను వనపర్తి హైస్కూల్లో (మహబూబునగరం జిల్లా) విద్యార్థిగా నున్నప్పుడు కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు రచించిన హనుమప్ప నాయక వృత్తాంతం నాకు పాఠ్యంగా ఉండింది. ఆ కథ చదివినప్పుడు నేనెంతో ఉత్తేజితుడనైనాను. ఇన్నినాళ్ళకా కథను కావ్యరూపంలో మలచగల్గినందుకు కృతార్థుడనైనట్లుగా తలంచుచున్నాను. కావ్యసౌందర్యం, ఔచిత్యాల దృష్ట్యా నేను కథలో కొన్ని చిన్న మార్పులు చేసినాను. ప్రథమ ద్వితీయాశ్వాసాలలో హనుమప్ప జననోదంతమును వివరించినాను. హనుమప్పను హనుమత్ప్రసాదజనితుడుగా చిత్రించినాను. ఈ రెండాశ్వాసములలో హనుమప్ప మాతాపితరులకు సముచిత

మైన స్థానం కల్పించడంతోబాటు, హనుమప్పతల్లికి అన్నమ అనే నామకరణం కూడ చేసినాను. హనుమప్ప కావ్యనాయకుడగుటచే, ఆతని జన్మవృత్తాంతం వివరించడం కథకు బలం చేకూర్చగలదని ఈ మార్పులు నేను చేసినాను. అట్లే హనుమప్ప మాఘమాసంలో సోమనాద్రి సమక్షంలో జరిగే వీరవిద్యాప్రదర్శనలో పాల్గొని, ఆతని కొల్వులో ప్రవేశించినట్లుగా వ్రాసినాను. ఇట్టి ప్రదర్శనలు మాఘమాసంలో జరిగేవి అనడానికి కొన్ని చారిత్రకాధారాలున్నాయి. గద్వాల సంస్థాన వైభవాన్ని, కార్తీక మాఘమాసాలలో గద్వాలలో జరిగే గోష్ఠులను గురించి శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిలవారు "సంస్థానముల సాహిత్యసేవ" అనే లఘు గ్రంథంలో కొంతవఱకు విపులంగానే వ్రాసినారు. వారు తెల్పిన పండిత, నటక, గాయకగోష్ఠులతోబాటు, వీర, మల్లవిద్యాప్రదర్శనలుకూడ ఉండేవిఅనే నమ్మకంతో నేనిట్లా వ్రాసినాను. పంచమాశ్వాసంలో హనుమప్ప శత్రువుల స్కంధావారము నుండి సోమనాద్రి హయమును తెచ్చే సందర్భంలోకూడ ఔచిత్యదృష్టితో ఒక చిన్న మార్పును చేసినాను. హనుమప్ప చొప్పమోపునమ్మి, దాని మూల్యము తనకు ముట్టలేదనే సాకుతో చీకటిపడువఱకును హయశాలాంతికమున నున్నట్లు ప్రతాపరెడ్డిగారు వ్రాసినారు. కాని ఎవడోయొకడా మూల్యమునిచ్చివేసిన అతనికక్కడ ఉండుట కవకాశముండదుకదా! అందుచేత నే నాతడు లభించిన మూల్యమును హయశాలాంతికమందలి యిసుకలో పోగొట్టుకొన్నట్లు, దానికై అన్వేషిస్తున్నట్లు నటిస్తూ కాలయాపనచేసినాడని వ్రాసినాను. ఈ సాకు ప్రతాపరెడ్డిగారు వ్రాసిన దాని కంటె ఔచితీసమంచితంగా ఉంటుందనే నమ్మకంతో నేనీ చిన్నమార్పుసుచేసినాను. అట్లే ఔచితీదృష్ట్యా, ఆఱవ ఆశ్వాసంలో లింగమరాణి భటులకు పంపిన పసుపు కుంకుమ వృత్తాంతాన్ని తొలగించి దాని స్థానంలో హనుమప్పనాయకుడు యుక్త కార్యోద్యుక్తులగునట్లుగా తోడిభటులను ప్రేరేచినట్లు, వారు త్తేజితులై గజాఘాతములతో తలుపులు బ్రద్దలుగొట్టి, దుర్గాంతరమున ఆపన్నుడైన సోమనాద్రికి తోడైనట్లు వ్రాసినాను. చారిత్రకంగా లింగమరాణివృత్తాంతం నా కంత విశ్వసనీయంగా అగుపించలేదు. అందుచేత ఈమార్పు చేసినాను.

ఈ కావ్యంలో నేనధికంగా మాత్రాఛందస్సును వాడినాను. ఈ ఛందోబీజములు నా తొలికావ్యమైన అశ్రుమాలలో పుష్కలంగా ఉన్నాయి, ఈ కావ్యంలో నవి ప్రరోహమానములైనవి. నవ్యులకిందులోని కొన్ని ఛందోరీతులు వింతగా దోచవచ్చును. అందుచేత ఈకావ్యంలోని ఛందస్సునుగురించి నేను కొంత విపులంగా చర్చిస్తాను. ముఖ్యమైన త్ర్యస్ర, మిశ్ర, ఖండగతులనే నేనిందులో వాడి

నాను. ఒకేగతిలో కొన్ని యెడల మాత్రలు తగ్గించి, హెచ్చించి వ్రాసినాను. ప్రతి ఛ్ఛందమందును యతినో, ప్రాసయతినో నియతంగా పాటించినాను. నేను వ్రాసిన మాత్రాఛ్ఛందాలను బహుళంగా i) సీసతుల్యములు ii) కందతుల్యములు iii) ద్విపదతుల్యములు iv) ఇతరములు అనే నాల్గు తరగతులక్రింద విభజింప వచ్చును. వీనికి చెందిన కొన్ని ఉదాహరణముల నీక్రింద పేర్కొంటాను. యతి మైత్రిని inverted comma లచే సూచించినాను.

I) సీసతుల్యములు ;

సీసతుల్యములన్నీ ఖండగతికి చెందిన ఛందములు. వీనిలో నీక్రింది భేదములున్నవి.

a) ప్రాచీన సీసపద్యం. ప్రతిపాదంలోను 6 ఇంద్రగణాలు, 2 సూర్య గణాలుంటాయి.

ఉదా :- "అ"ల్పాయువగుటచే "నా"దిజన్మముసందు
"మ"ఱల బుట్టిన యభి"మ"న్యుడనగ

b) పై పద్యంలోని భ, నల గణాలను భల, నలల గణాలతో ప్రతిక్షేపిస్తే ఏర్పడే పద్యం. ఇట్లేర్పడిన పద్యంలో చక్కని లయసౌష్ఠవ ముంటుంది.

ఉదా :- "మీ"ద గజవాజితతి "మీ"ద విస్ఫురితాస్త్ర
"పా"ణులై బహువీర"వ"రులు వోవ

c) పాదపూర్వార్ధంలో 4 ఖండగతి గణాలు, ఉత్తరార్ధంలో 3 ఖండ గతి గణాలపై ఒక సూర్యగణం చేరిస్తే ఏర్పడే పద్యం.

ఉదా :- "తు"ంగభద్రానదీ "తో"యవల్లికలట్టు
"లు"ల్లముల విజగీష "వె"ల్లువగుగాత !

d) పాదపూర్వార్ధంలో 4 ఖండగతిగణాలు, ఉత్తరార్ధంలో 3 ఖండ గతిగణాలపై రెండు సూర్యగణాలుగల పద్యం.

ఉదా :- "పా"టలీపురి నాంధ్ర"పా"లనమ్మును నిల్పు
"శా"తకర్ణులనాటి "స"ంగ్రామపాటవంబు

e) పాదపూర్వోత్తరార్ధాలలో నాల్గేసి ఖండగతిగణములు గల్గినపద్యం

ఉదా :- "ఒ"క మహీజము చుట్టు"సూ"ర్మికోపమమౌచు
"వ"లమానమగు చైత్ర"వ"ల్లరీ విధమౌచు

f) పాద పూర్వార్ధంలో 4 ఖండగతిగణాలు, ఉత్తరార్ధంలో 4 ఖండ గతిగణాలపై నొక సూర్యగణంగల పద్యం.

ఉదా :- "అ"వనిలోపల పుణ్య 'మా"ర్జించు కొన్నట్టి
"అ"నఘు లెవ్వఁడొ కందు"ర"ట్టి విభనంబు ద్రిదివాన

g) పైపద్యానికి విలోమంగా ఉండేపద్యం. అంటే పాదపూర్వార్ధంలో నాల్గు ఖండగతిగణాలపై ఒక సూర్యగణం, ఉత్తరార్ధంలో నాల్గు ఖండగతి గణాలుగల పద్యం,

ఉదా :- "చ"లదూర్మికాసంఘ "సం"ఘట్టనోదితమృదంగ
"ల"లిత సంరావాను "లా"స్యన్మయూరంబు

h) ప్రతిపాదంలోను 4 ఖండగతి గణాలపై ఒక సూర్యగణముండే పద్యం.

ఉదా :- "దా"ంపత్యవల్లరిం "ద"ళుకొత్తు చిన్నారిపూపు
"పు"న్నామనరకంపు "బు"లివాతి దప్పించు జోదు

i) పాద పూర్వార్ధంలో 4 ఖండగతిగణాలు, ఉత్తరార్ధంలో 5 ఖండ గతిగణాలు గల పద్యం.

ఉదా :- "చివు"రుగొమ్మల డాగి, "యెవ"రికిం గనరాక
"భువి"నెల్ల మృదుగాన "విఎ"శత్వమున ముంచె
బరభృతము

j) ప్రతిపాదంలోను ఐదేసి ఖండగతిగణాలు గల పద్యం.

ఉదా :- "తొ"ల్లి శ్రీరామునకు "దో"డైన హనుమదాదుల వోలె
"అం"డయై పోరి రాం"ద్రా"వనీపతి కాహవమునందు

పై ఉదాహరణాలలోని రెండు పంక్తులను ఏకపాద పూర్వోత్తరభాగము లుగా గాక, రెండు ప్రత్యేకపాదములుగా గ్రహించి, సామాన్యమైన చతుష్పాది పద్యాలను సృజించవచ్చు. ఇట్టి చతుష్పాదులు కావ్యంలో కొల్లలుగా నున్నవి.

శాస్త్రరీత్యా వీనిని సీసతుల్యాల ప్రత్యేకోదాహరణాలుగా (special cases) గ్రహించవచ్చు,

II) కందతుల్యములు :

కందతుల్యముల చతురస్రగతికిన్నీ చెందిన ఛందములు. వీనిలో నీ క్రింది భేదములున్నవి.

a) ప్రాచీన కందం. ఇట్టివి కావ్యంలో కొల్లలుగా నున్నవి.

b) ప్రాచీన కందాన్ని కేవలం మాత్రాచ్ఛందంగా పరిలక్షించి గణ స్థాననిర్బంధాన్ని విస్మరించి వ్రాసినవి. ఇట్టివి క్వాచిత్కంగా ఉన్నాయి.

ఉదా : ఈయే డొదవెడు సంతతి
"ఆ"యే డొదవెడు నని వారాశాయతి దశ
హాయనము ల్వేచిరి; కా
"నీ" యది నీఋననిడు వ"న్నీ"రే యయ్యెన్.

c) బేసిసంఖ్యగల పాదాల్లో 3, సరిపాదాల్లో 4 చతుర్మాత్రా గణాలు గల పద్యం.

ఉదా : "ర"థచక్రంబుల "క్ర"మమున
"రా"త్రులు పవళులు "ర"యమున దిరిగెన్
"ప"రిణయ మాదిగ "బ"దివ
"త్స"రములు కాలో"ద"ధిలో గలసెన్

ఇందులో ఐచ్ఛికంగా 1, 3 పాదాల్లోను యతి పాటింపబడింది.

d) బేసి పాదాలలో 3 చతుర్మాత్రాగణాలు, సరిపాదాలలో 5 చతుర్మాత్రాగణాలపై నొక గురువు గల పద్యం.

ఉదా : కిసలారుణ వసనములున్
"కు"సుమాలంకృతులుం జే"కు"ర దీరలతాంగి
విసరము గై సేయగ వని
"కొ"నగించిన దర్పణమన "బా"సరసిం పెసగెన్.

e) ప్రతిపాదంలోను నాల్గు చతుర్మాత్రాగణాలుగల పద్యం.

ఉదా : "ఖ"ండిత వృక్షక "కా"ండాంచితమై
"క్రం"దన నినదం"క"ర దిక్తటమై
"శా"రద నీరద "చం"దన సుందర
"సి"తసింధురమై "చె"లువొందినదది

f) బేసిపాదాలలో 4 చతుర్మాత్రాగణాలు, సరిపాదాలలో 4 చతుర్మాత్రాగణాలు గల పద్యం.

ఉదా : "కందు"ము కౌశల "మంది"రులన్ ము
"న్నెం"దటినో యాశ్వికకుల "హి"మమందిరులన్
"కందు"మె వాజుల "యందీ" చందమ
"మం"దాద్భుతమగు నైపుణి "మం"దున కైనన్

g) బేసిపాదాలలో 4 చతుర్మాత్రాగణాలు, సరిపాదాలలో 6 చతుర్మాత్రాగణాలుండే పద్యం.

ఉదా : "వం"చనచే నొక "వా"ర్యము నపహ
"రిం"చిన జిక్కుడు మనుకొని"రే" యతులిత
హేమాహార్యా
"చం"చల ధీరులు "శా"స్త్రవవీరుల
"వం"చితధృతినిక గూల్చుడు "వా"రలయాశా
హర్మ్యములన్

ఇవే కాకుండా ప్రతిపాదానికి ఐదేసి చతుర్మాత్రాగణాలుండే ఛందాలు, 6, 7, 8 గణాలుండే ఛందాలుకూడ ఉన్నాయి. వీటిలో కొన్నియెడల మాత్రలు లోపించడం, వృద్ధికావడంవల్ల కించిద్భిన్నమైన ఛందాలేర్పడుతాయి. ఇట్టివికూడ తరచుగా కనిపిస్తాయి.

## III) ద్విపదతుల్యములు :

ద్విపదతుల్యములను ఖండగతికి చెందిన ఛందాలుగానే ఎన్నికచేయవచ్చును. వీనిలో నీక్రింది భేదములున్నవి.

a) ప్రాచీన ద్విపదసమములు - అంటే లయసౌష్ఠవంకొఱకు భ, నల గణాలకు బదులు భల, నలలములను వాడి వ్రాసినవి. ఇట్టి ఛందములు కావ్యంలో అనేకంగా ఉన్నాయి.

b) మొదటిపాదంలో నాల్గు పంచమాత్రాగణాలు, రెండవ పాదంలో 3 పంచమాత్రాగణాలపై ఒక సూర్యగణం. వీని ప్రస్తావన సీసతుల్యాలలో ఇది వఱకే వచ్చింది.

c) మొదటి పాదంలో 3 పంచమాత్రాగణాలపై నొక సూర్యగణం, రెండవపాదంలో 4 పంచమాత్రాగణాలుండే పద్యం.

ఉదా : "నూ"నూగు మీసాల "నూ"త్న యౌవనము
"నాటి"కే వీరులన్ "మేటి"యై యతడొప్పె

d) మొదటిపాదంలో 3 పంచమాత్రాగణాలు, రెండవపాదంలో 4 పంచమాత్రాగణాలుండే పద్యం.

ఉదా : "అ"ని సోమభూపాలు "డం"తటన్
"ఘ"నధరాఖండముం "గా"న్కగా నొసగుచున్

e) ప్రథమపాదంలో 2 పంచమాత్రాగణాలు, రెండవపాదంలో 3 పంచమాత్రాగణాలపై నొక సూర్యగణముండే ఛందం.

ఉదా : ముంగిట్ల రంగారు
"రంగ"వల్లుల దీర్చు "నంగ"నల నీలి
ముంగురులతో గూర్మి
"చెంగ"లింపగ గొంత "సే"పాడి యాడి

f) ప్రథమపాదంలో 2 పంచమాత్రాగణాలు, రెండవపాదంలో 4 పంచమాత్రాగణాలుండే ఛందాలు.

ఉదా : రేయెండకుం గుమిలి
"మే"యుంచి పాన్పునన్ "మి"క్కిలిం బొఱలు విత
హాయతల నిట్టూర్పు
"వా"యువులతో స్నేహ"భా"వంబు వహియించి

పైని పేర్కొన్న ఛందాలలోని పాదాలలో మాత్రావృద్ధి, లోపాలవల్ల ఏర్పడిన కించిద్భిన్నమైన ఛందాలుకూడ ఇందులో పొడసూపవచ్చును.

IV) ఇతరములు :-

పైమూడు తరగతులకును చెందని మాత్రాచ్ఛందా లనేకంగా ఉన్నాయి ఈటన్నిటినీ ఇతరములక్రింద చేర్చినాను. వీటిలో ముఖ్యమైనవీవిధంగా ఉన్నాయి.

a) త్రిగణసంయుతములై, ఖండ, చతురస్రగతులకు చెందిన ఛందాలు.

ఉదా : "ఏ"మో కావుగదా యివి
"యె"ల్లయు నలలన్ వ్రాసిన (చతురస్రగతి)
"వ్రా"లే ? మృగతృష్ణం బ్రతి
"భా"సించెడు నీరములే ?

ఉదా : "నాయ"కున కీవార్త సుమనోజ్ఞ
"గేయ"మున కన్న ప్రియమయ్యను (ఖండగతి)
"నాయ"కుని డెందమం దొకటియా
"వేయి" హరిచాపముల్ పూచెను.

పైవిధమైన ఛందాలలో మాత్రావృద్ధి, లోపాలవల్ల కించిద్భిన్నమైన ఛందాలేర్పడుతాయి. ఇట్టివికూడ కావ్యంలో తరచుగా కనిపిస్తాయి.

ఒక ఉదాహరణం :

ఉదా : "వి"జయేందిరతో "వి"చ్చేసెడు
"వి"భుమార్గములో "వె"లయించిన
"శుభ"హారతులన 'ప్రభ'సూపెన్ (చతురస్రగతి)
"కెంద"మ్ముల బహు "బృంద"మ్ములు

b) ఏవోకొన్ని నిర్ణీత సంఖ్యగల త్ర్యస్ర, మిశ్రగతి గణాలుగల ఛందాలు. వీనిలోగూడ మాత్రాలోపవృద్ధుల వల్ల అనేకమైన విభేదా లేర్పడు తాయి. కొన్ని యుదాహరణములు:

ఉదా :- "కాంచి" నాయం "డంచి" త్రప్రమ
"దా"ర్ణవప్లవ"నా"ప్తి మించున్ (మిశ్రగతి)
"కాంచి" నాయడు "మంచు"గుబ్బలి
"మించు" ముదమెద "నించి"మించున్.

ఉదా :- "సాగి" సాగి ఇటుల కడకు
"నాగి"పోయె జనగణమ్ము
"సాగి" సాగి తటము నొరసి (త్ర్యస్రగతి)
"ఆగి" పోవు నలవిధమ్ము.

ఉదా :- "అ"చట బొల్చె కేశ"వా"లయమ్ము
"అ"చల యందు స్వర్గ "మ"దియె సుమ్ము
"హ"స్తి డిగ్గి సోము "డ"చట నిల్చె (త్ర్యస్రగతి)
"ప"రిజనమ్ము లతని "పి"రుద బొల్చె.

C) గీతపద్యాలు(తేటగీతులు). ఇట్టివనేకంగా ఉన్నాయి

ఇవి నేనీ కావ్యంలో ననుసరించిన ముఖ్యమైన మాత్రాచ్ఛందో రీతులు. పై ఉదాహరణాలలో నేను వీనిని సమగ్రంగా కాకపోయినా, స్థూలంగా స్పర్శించినాను, మాత్రాచ్ఛందస్సులేకాక, రసభావానుకూలంగా నేనక్షరచ్ఛందస్సులను, కూడ ఇందులో వాడియున్నాను. మన కనూచానంగా వస్తూవున్న ఉత్పల, చంపక మత్తేభ వృత్తాలేకాక స్వకల్పిత నూత్న వృత్తాలనుగూడ వ్రాసినాను. ఈ నూత్న వృత్తాల లక్షణాల్క్రింద పేర్కొంటాను.

1) మ స జ త త గ గణాలు గల్గి, 10వ అక్షరం యతిగాగల్గి, 16వ అష్టిచ్ఛందస్సులో పుట్టిన 18776వ వృత్తం. నడకలోనిది ఒక సగణం లోపించిన శార్దూలంలాగా ఉంటుంది. దీనికి "దయానా" వృత్తమని పేరిడినాను.

ఉదా : "వా"చాతీతము నీమనీష "వ"ంద్యంబు నీజ్ఞానమున్.

2) ఒక అక్షరం తక్కువైన శార్దూలం. దీనిలో మ స జ స ర ర గణాలుండి 12వ అక్షరం యతిగా ఉంటుంది. ఇది 18వ ధృతి ఛ్ఛందస్సులో పుట్టిన 75608వ వృత్తం. దీనికి "నయాగరా" వృత్తమని పేరిడినాను.

ఉదా: "కో"శాగారము గుల్లవాటినను "ఘో"రాపదల్గూడినన్

3) భ ర న మ గ గ గణాలుగల్గి, 8వ అక్షరం యతిగాగల్గి, 14వ శక్వరీ ఛందస్సులో 470వదిగా పుట్టిన వృత్తం. దీనికి "మార్గరీటా" వృత్తమని పేరిడినాను.

ఉదా : "ప్ర"త్యయముం ఘటించి పరిపూతుం డల్లా పై

4) ఒక అక్షర మెక్కువైన ఉత్పలమాల. ఇది భ ర న భ భ ర య గణాలనుగల్గి, 10వ అక్షరం యతిగాగల్గి, 21వ ప్రకృతి ఛ్ఛందస్సులో 355679 9వదిగా పుట్టిన వృత్తం. దీనికి "ఊర్మిళా" వృత్తమని పేరిడినాను.

ఉ : "వా" నిదె భాగ్యవైభవము, వానిది సార్థకజీవనంబు, స్థైర్యా నూనత .... .. .... .... ....

5) త ర ర ర ర గణాలను గల్గి, 9వ యక్షరం యతిగా గల్గి, 15వ అతి శక్వరీ ఛందస్సులో 9394వదిగా పుట్టిన వృత్తం. దీనికి "ఓల్గా" వృత్తమని పేరిడినాను.

ఉదా : "దు"ర్దాంత వైరిశుద్ధాంత "దోషా"కరాస్యప్రభం
"దో"ర్దండ రాహుసంగ్రస్తి "దూ"రించు యోధాగ్రణుల్

ఇవి నేను కల్పించిన నూత్నాక్షర వృత్తములు. భావం ఛందస్సులో నిముడాలనే బదులు ఛందస్సు భావంలో నిముడాలనే అభిప్రాయంగల వాణ్ణి నేను. అందుచేత నొక అపూర్వచ్ఛందస్సు భావంలో స్ఫురించినప్పుడు కాదనక దానినట్లే స్వీకరించినాను. అందుచేత కావ్యంలో బహుళమైన ఛందోవైవిధ్యం చోటుచేసుకున్నది.

యతులు: యతి విషయంలో కొన్ని యెడల నేను కొంత స్వేచ్ఛను పాటించినాను. సాధారణంగా నేను పెట్టుకున్న నియమాలివి. 1) పాదమునకు మూడేసి గణాలున్న చందాలలో యతిని తృతీయగణారంభంలో గాని లేక ఉత్తరపాదప్రథమాక్షరంలోగాని నిల్పినాను. 2) పాదమునకు నాల్గేసి గణములున్న ఛందములలో యతిని తృతీయగణ ప్రథమాక్షరంలో నిల్పినాను. ఒకటి రెండు చోట్ల మాత్ర మిందుకు భిన్నంగా ఉత్తరపాదారంభంలో యతి నిల్పినాను. 3) పాదమునకు రెండేసి మిశ్రగతిగణాలున్న ఛందాలలో యతిని ద్వితీయగణారంభంలో నిల్పినాను. కాని ఒకటి రెండు చోట్ల మాత్రము ఉత్తరపాదారంభంలో యతిని నిల్పినాను. 4) పాదమున కైదేసి గణములున్న ఛందాలలో కొన్నియెడల తృతీయగణారంభంలోను, కొన్ని యెడల చతుర్థగణారంభంలోను, యతిని నిల్పినాను. 5) ఐదింటికంటె నెక్కువ గణాలుగల పాదాలలో, సౌష్ఠవము (Symmetry) చెడని రీతిగా, తగుచోట యతిని నిల్పినాను. నూటికి 90 పాళ్ళు నేను ప్రసిద్ధమైన యతిమైత్రులనే పాటించినాను. కాని కొన్నియెడల (ఇది అతివిరళంగానే జరిగింది) నాతిప్రసిద్ధములైన ర-ల, ట-ద, ఉ-ఋ, ఉ-వు యతులనూ, అఖండయతులనూ వాడినాను. ఈ అప్రసిద్ధయతుల విషయంలో నేను మహాకవి పోతనామాత్యుని ఒరవడిగా పెట్టుకున్నాను. అన్వయోచ్చారణ సౌలభ్యములకై కొన్నియెడల విసంధి చేసినాను. బహుళ జనప్రచారంలోనున్న "సంధి షరతుల"వంటి పదాలను కొన్ని యెడల వాడినాను.

ఇక నీ కావ్యప్రకాశమునకు సహాయభూతులైన వారికి కృతజ్ఞతలు తెల్పుకుంటాను. అసమగ్రమైన వ్రాతప్రతిని చదివి నన్ను ప్రోత్సహించినవారు డా॥ ముదిగొండ శివప్రసాదుగారు మఱియు శ్రీరంగాచార్యులవారు (పాలెం) తమకు

తలమునకలుగా పనులున్నా తీరించుకొని ఈ కావ్యము నామూలాగ్రంగా చదివి తమ అమూల్యాభిప్రాయాన్ని వ్రాసియిచ్చిన వారు వాక్ప్రపంచదివాకరులైన డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు. వారింత శ్రమకోర్చి నా కావ్యపఠనం చేయడం వారికి నాయందుగల వాత్సల్యానికి దార్కాణం. అట్లే డాక్టరు జి. వి. సుబ్రహ్మణ్యంగారు నాపై ఆదరంతో, ఈ కావ్యంపై విమర్శనాత్మకమైన పీఠికను వెలయించినారు. ప్రియమిత్రులు అల్లంరాజు వేంకటరావుగారు (సుధామ) ముఖపత్రమును తీర్చిదిద్దినారు. ఔదార్యంతో డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు యువభారతి ద్వారా దీనిని ప్రచురించడానికి అవకాశం కల్పించినారు. వీరందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

ఇట్లు బుధజనవిధేయుడు

—తిరుమల కృష్ణదేశికాచార్యుడు

# భారతస్తవము

మా భరతదేశం మంజులారామం
మా భరతదేశం మహికి మణిదామం

చతురాగమముల జగతికి నొసగిన
పావనకల్పక పాదపమదిగో
వాల్మీకి సుధీవల్లిక పూచిన
రామాయణసుమరాజం బిదిగో

ఇదిగో వ్యాసమునీశ్వర కల్పిత
పంచమవేదంబను పద్మవనం
అల్లదిగో కణ్వాత్మజ వాకిట
బెరిగిన లతికా తరు రురు వారం

భరతుని అభినయపాఠము నేర్చిన
కలహంసల పదవిలసన మదిగో
జయదేవుని శిష్యత్వము గాంచిన
తీయనిపాటల కోయిల లివిగో

ఆంధ్రసరస్వతి కారతినెత్తిన
అభినవభోజుని ఆరామంబిది
అందలరిన కవిబృందము పల్కులు
విందొనరించును వీనుల నిరతము

మా భరతదేశం మంజులారామం
మహికి మా దేశం మంజుమణిదామం
మా భరతదేశం మంజులారామం
మహికి మా దేశం మందారదామం

# భారతి స్తవము

వసవల్చు బాలకుల పసిడినాల్కల పైని
దొలియక్కరంబులం దొలిచి తొలిచి
సంతృప్తిలేని జిజ్ఞాసువుల మెదడు గి
న్నెలలోన జ్ఞానసుధ నినిచి నినిచి
వెలుగొంద నిరతంబు విజ్ఞానదీపంపు
సెమ్మెకుం జమురంద జేసి చేసి
నిన్ను మతులందు బంధింపగానెంచు గు
ట్టలతోడ దోబూచు లాడి యాడి

ఎంత యలసితొ మాయమ్మ ! యీ యనంత
విశ్వమందున విజ్ఞానబీజవితతి
జల్లు వృత్తి నొక్కింత విశ్రాంతి గాంచ
రమ్ము మామక హృదయాంతరమ్మునందు

అత్యమోఘమౌ విశ్వసాహిత్యవనము
లోన దెల్లుపూలకు సరిలేని వింత
సౌరభంబుల, రంగుల నేరి కూర్చి
తమ్మ ! నీకెంత ప్రియమమ్మ యాంధ్రులన్న !

ఆదికవి నన్నయ్య అక్షరంబులలోన
ప్రచురమై పాఱు రుచిరార్థధునివీవు
తిక్కన కవిబ్రహ్మ తెన్గునుడికారమ్ము
లో దేజరిలు శక్తి వోదేవి నీవు
భక్తపోతన్న పదబంధముల నందముగ
నందియలు సవరించు సుందరివి నీవు
శ్రీనాథ కవినాథ శృంగార రసడోలి
కల దూగు రాయంచకలికివే నీవు

అల్లసానికవీంద్రు నల్లికం బెనగొన్న
మధురసంబులు గాఱు మార్ద్వీక మీవు
భట్టుమూర్తి కవీంద్ర పద్యవసుహర్మ్యముల
నిల్చి వీణియ మీటు నెఱజాణ వీవు
"విశ్వనాథ" కవీంద్ర విస్తార విజ్ఞాన
కల్పలత బూచు లతికాంత మీవు

ఇన్ని వేషాల ధరియించి సన్నుతాంధ్ర
సాహితీ నాట్య రంగాన జాణవైన
నీ వతిప్రసన్నాకృతి నావహిల్లి
రమ్ము నర్తింప నా యాస్యరంగమందు

## జో హా రు

సురవరం ప్రతాపరెడ్డికి

కాలం బనియెడు కాండపటంబున
డాగిన యాంధ్రుల మూగచరిత్రపు
గలికికి ముద్దుల పలుకులు నేర్పి
వెలుగున్ జూపిన విద్వన్మణికిన్

ఆంధ్రుల సాహిత్యాంబుధి నవలో
డన మొనరిచి యందున డాగిన సాం
ఘిక ధర్మపు మణినికరము దొలిగా
వెలికిం దోడిన విద్వన్మణికిన్

ఇవె నా జోహారులు !
ఇవె నాదు నమస్సులు !
ఇవె తత్పదసేవకు
నేనిడు సుమనస్సులు !

# స మ ర్ప ణ

శ్రీహరితస గోత్రాంబుధి
జెలువొందిన హిమఘృణియై
ద్వత్రిముడై శరమర్షణ
గోత్ర వియత్పథ మణియై

చంద్రాంశము సత్కరుణన్
సౌరాంశము సత్వొందితి
గలిగిన సచ్చారిత్రుని
ఘనసుమనోగణమిత్రుని

వరబల్మార్పురసరసీ
నిరతవికస్వరనళినుని
నిరతార్చిత హరిచరణుని
తిరుమలవంశాభరణుని

రామతాతాచార్య రమణీయ నామున్
రామచంద్రార్చనాలబ్ధసంక్షేమున్
కోమలాంతఃకరణు, గుణరత్నధామున్
శ్రీమహితు, మజ్జనకు, సితకీర్తిసోమున్

విలసజ్జ్యోతిష విద్యానిధియై
వరమంత్రశాస్త్ర పారంగతుడై
శాపురపుర భూషణుడై పరగిన
వరసుడు శ్రీ శేషాచార్యునికిన్

శ్రీమత్తిరుమల జినకుంటాన్వయ
సురధుని బొడమిన సరసీజంబై
అతులిత సౌందర్యరసాకృతియై
యలరిన సాధ్వికి నలవేలమ్మకు

తొలిగర్భముగా నిలలో మెట్టిన
సాక్షాల్లక్ష్మిన్ సతీమతల్లిన్
లక్ష్మమ్మాఖ్యన్ రమ్యగుణాఢ్యన్
మంగళచరితన్ మజ్జనయిత్రిన్

సానందుడనై భజించి
సరసవచోగుంభనమున
నీవిధి బ్రార్థించెద నా
జీవనమే తరియింపగ

ఇలువేల్పులు పితరులటంచుం
బలుకుగదా ! శ్రుతిశాస్త్రంబుల్
తద్హృదయాహ్లాద మొనర్పం
దగు నెదియని తలపోయునెడన్

శతపత్త్రి సుకుమార శయములే కందంగ
బరమేష్ఠి కంటకిత పాదంబు లొత్తి యొత్తి
అభ్రగంగానిలాహతి దక్కి మాటికిన్
శ్రుతిదప్పు వీణదుర్గతి కెంతొ విసివి విసివి
స్వారికిన్ రమ్మన్న స్వర్ణదీషండముల
దాగికొను రాయంచ దంభమున కలిగి యలిగి
కల్పద్రుఫలరాశి ఘనమాధురికి జొక్కి
చేతికిన్ రాకున్న చిల్కచెలి జీరి చీరి

శాంతి సుంతయు గనలేక స్వాంతమందు
సురలలోకముకన్న మేల్నరుల లోక
మనుచు జయ్యనం దివినుండి యవతరిల్లి
నాదు ముంగిట నిల్చెను నలువరాణి

అట్లు నిల్చిన వాణికి నంజలించి
స్వాదు భాషల నామె క్లేశము హరించి
నవ్య సౌఖ్యద నిలయంబు నాదు స్వాంత
నీరజమ్మున నామెను నిల్పుకొంటి

ఆవాణీ ప్రేరితమగు
శ్రీవాక్యంబులె యివి; యివి శ్రీమద్గద్వా
లావిభుభట నిస్వార్థ క
థావిషయ సుగంధ పరిణతాద్భుత సుమముల్

ననలియ్యవి కొని కూర్చితి
హనుమన్నాయకమణి విభవాన్విత మీ శో
భనహారమ్మును; మీపద
వనజమ్ముల కడ నిలిపితి భక్తిం దీనిన్

సుందరమగు నీయుడుగర
నందుకొని దయాన్వితమతి నామోదలస
న్మందస్మితశీతసుధా
బిందుల నన్నుం దడుపుడు ప్రియమేపారన్

దవిష్ఠమగు కెనడా దే
శవసతి నుండుట కతమున సాక్షాత్తుగ మి
మ్మవిరతము గొల్వనైతిని;
అవిరళమగు వెల్తిహొదదామె నాత్మను నన్

కానీ నేడది వీడను
ఈ నవకావ్యంపు బొత్తి నింపుదలిర్పన్
మీనయసన్నిధి నునుచుట
నీ నెలతుక కూర్చు మీకు నిమ్మల నెపుడున్

సార ప్రసాదగుణ వి
స్తారయు, మాధుర్య విలసితామృత భాషా
సారయు, మంజుగతి మనో
హారియు, నగు నీ వరాంగి యలరించు మిమున్

కావున నీచెలువకు మీ
సేవాభాగ్యము గలుగగ జేయుడు, దానం
బావన మొనరింపుడు నా
జీవనముం బితరులార ! స్థిరసౌహృదులై

## ష ష్ఠ్యం త ము లు

అవనీ సుపర్వ మణికిన్
భవికాప స్తంబ సూత్రవర్తితమతికిన్
సువిపశ్చిన్మణికిన్, సత
త వైష్ణవమతైక ధర్మతత్పరమతికిన్

చతురాగమార్థ వేదికి
చతురపురాణార్థ బుద్ధ సన్మార్గునకున్
చతురసుభాషామోదికి
సతత సద్వర్తనజితారిషడ్వర్గునకున్

ప్రతిసంవత్సర సీతా
పతి పట్టోత్సవ సమయసభాగత సత్పం
డిత పరితోషణునకు, దత
వితరణ చణునకు, ఘనునకు, ప్రియజనకునకున్

పావనగుణచారిత్రకు
శ్రీవనజాక్షీ సమాన శివరూపిణికిన్
లావణ్యాంచితగాత్రకు
క్ష్మావనజాక్షీనిభక్షమాభూషణకున్

ఆత్రేయస గోత్రజకున్
వృత్రారిసతీ సమాన విభ్రమ యుతకున్
పుత్రీపుత్రాష్టకకున్
మైత్రావరుణిప్రియాభ మహిమాన్వితకున్

కరుణోదారకు, కమలా
చరణాంబురుహార్పితాత్మ సరసీరుహకున్
వరగుణమణిహారకు, శ్రీ
కరవాక్సారకును, మామకప్రసువునకున్

కానుకగా నేనొసగెడు
కావ్యంబునకున్ హనుమ
ప్పనాయకాఖ్యంబునకున్
ప్రారంభంబగు నీగతి

## గ్రంథకర్త జననీ జనకులు



శ్రీమాన్ తిరుమల గృధ్ధంటి రామతాతాచార్యులు
శ్రీమతి ఆదిలక్ష్మమ్మ గారు

# ప్రథమాశ్వాసము

దూష్యయవనవ్రాత్య దుర్యశమ్ము నుబోలె
ధూమమయ భయద జలదోత్కరమ్మునుబోలె
ధరణి బర్విన యిరుల బరిమార్ప జనుదెంచు
హరిదశ్వ విశదాశ్వమన బ్రాచి తెలుపారె

దుష్కర తురుష్క సేనా
నిష్కర్తనచణ నృపాసి నివహమువోలెన్
పుష్కర మిత్త్రుని రోచులు
పుష్కలమయ్యె నపుడుర్వి పొంపిరివోవన్

విజయుండై వేంచేసెడు
విభుగన విప్పారిన వద
నమ్ములబోలెన్ శ్రీసద
నమ్ములు సితనళినమ్ములు

విజయేందిరతో విచ్చేసెడు
విభుమార్గములో వెలయించిన
శుభహారతులన బ్రభసూపెన్
కెందమ్ముల బహుబృందమ్ములు

కాసారములలోని కంజసౌరభమింత
సంపెగల జొంపముల జను సౌరభమునింత
మల్లెపందిరులలో మలయు సౌరభమింత
మొగలిపూబొదలలో దగు సౌరభమునింత

మోచికొని తిరుగాడె మురువొప్ప జిఱుగాడ్పు
అత్తరుల నమ్ముకొను వ్యాపారివలెనంత

కాసారకంజాలు కన్నుదెఱవకమున్నె
పూర్వదిశ తెలిపట్టుపుట్టమూనకమున్నె
తోటపొలముల జొచ్చి మోటగట్టిన కృషిక
కూటముల కడుతేటపాటల రుతులొకింత

బ్రహ్మసుముహూర్తనమున వ్యాసవిద్యానాథ
భాసకాళిదాస భవభూతి బాణాది
బహుకావ్య పద్మవన వాహ్యాళిపరులైన
బ్రహ్మచార్యాళి కావ్యాలాపములొకింత

తమనీడముల వీడి తత్తరంబున జగ
ద్బాంధవుండేతెంచు తరుణ మేతెంచెనని
లోకమున కెరిగింప నాకమున జరియించు
ఖగయూథముల తీవ్ర కలరావములొకింత

తొగరంచు పంచెలం దొడలపై కెగగట్టి
ముతకగొంగళు లెడమ మూపునందున బెట్టి
ముల్లుకోలల బట్టి గొల్లండ్రు దోల్కొంచు
జను పశూత్కరకంత జనితార్భటులొకింత

మట్టికుండలలోన మంచినీరెత్తుకొని
పీయూషముంగొంచు బృథ్వికిం జనుదెంచు
అచ్చెరలొనాగ రాయంచనడల గమించు
పల్లెతల యందియల ఘల్లుఘల్లనులింత

వహియించి పవనుండు వైతాళికుండయ్యె
అభినవోద్యత్ ద్యుమణ్యంశు కోమల కర
స్పర్శన స్పందితంబైన "*బొచ్చెంగన్న
పల్లికా" ప్రజలకా ప్రత్యూషసియందు

ముంగిట్ల రంగారు
రంగవల్లుల దీర్చు నంగనల నీలి
ముంగురులతో గూర్మి
చెంగలింపగ గొంత సేపాడియాడి

హరిసేవ కుదయాన
విరుల గోయంజేరు బిత్తరుల పైట
చెఱగులన్ ముడివెట్టి
తరులకుం గొంతతటి సరసమ్ములాడి

రేనిదుర వోరామి
ఆనవోదయవేళ నలసత న్నిదుర
నూనిన నవోఢా న
వీనాంశుకమ్ములం బ్రిదులంగ ద్రోచి

---

*బొచ్చెంగన్నపల్లి అనేది హనుమప్పనాయకుని జన్మగ్రామము

రేయెండకుం గుమిలి
మేయుంచి పాన్పునన్ మిక్కిలిం బొరలు విర
హాయతల నిట్టూర్పు
వాయువులతో స్నేహభావంబు వహియించి

ఆలవోక జరియించె నపుడు గంధవహుండు
ప్రథిత బొచ్చెంగన్నపల్లికా పద్మినీ
విభ్రమాలోకనావిలులిత స్వాంతుండు
మంజులాహల్యా ప్రమత్త మఘవసముండు

ఉదయాన నాగండ్ల నున్నతాంసమ్ములం
బొదవిపొలములపొంత బోవువారు
అరుగులం గూర్చుండి హరినామ కీర్తన సు
ధారసాస్వాదులై తనియువారు
పంచాంగ సంశ్రుతి ప్రవణులై బ్రాహ్మణుల
నంచితంబుగ సత్కరించువారు
రంగుటెద్దుల గట్టి రయమునం బండ్లను వి
హంగములవలె దోలునట్టివారు
రచ్చకట్టల జేరి ప్రాడ్వివాకత మీరి
చెచ్చెరం దీర్పులం జెప్పువారు
అంజలుల్ ఘటియించి ఆంజనేయుని ముందు
కంజమ్ములిడి మ్రొక్కగడగువారు
చెంగుచెంగున నెగురు చిన్నిలేగల చుంచు
లం గూర్మి దువ్వంగ లాచువారు

పాలకుండల జూచి ప్రక్కకుం జనకున్న
చీలులకు నామెతల్ సేయువారు
పులులట్లు జృంభించు పోతులం బట్టంగ
పలుపులంగొని వెంటనురుకువారు
కోరాడి కుప్పించు కోడెల న్వారింప
దరటులంగొని వెంటనురుకువారు

బహువిధ వ్యాపారపరచిత్తు లాపల్లి
కాహృదయ చైతన్యకరవృత్తు లెదురైరి
ప్రత్యుషః ప్రాలేయభార మందీభూత
గామికిం బూతసౌగంధ్యభృత్స్వామికిన్

సాలభిత్తుల నొనరు జాజుసున్నపుబట్టె
లల రజస్సత్వగుణముల లీలబోల
ముంగిట్ల ననుపారు మొల్లపూవుల డాల
భంగురప్రమదానుభావగతి మీర
ద్వారమ్ములందనరు తోరణమ్ములకాంతి
స్థిరభావచైతన్యగరిమంబు సూప
బహుళోన్నతముగాని గృహమాలయీభూత
మహితోత్తమాంగంబు మాడ్కి నింపార
సాకార వరమన స్సంకాశమగు నొక్క
యకలంకగృహ మప్పు డనిలుండు పొడగాంచె

ఆయింటికి బతియౌ ప్రతి
ఛాయుతు డంచితకులవి
ద్యాయుతు డతివిక్రమ బా
హాయుతుడగు నొకబోయడు

ఆతం డన్నమ యనియెడు గరితన్
ఆతతసౌశీల్యదయాభరితన్
సీతోపమపతిసేవానిరతన్
జేతోమోదం జేకొని యుండన్

రథచక్రంబుల క్రమమున
రాత్రులుబవళులు రయమున దిరిగెన్
పరిణయమాదిగ బదివ
త్సరములు కాలోదధిలో గలసెన్

ఈయేడొ దవెడు సంతతి
ఆయేడొదవెడునని వారాశయతి దశ
హాయనముల్వేచిరి; కా
నీయది నీఱుననిడు పన్నీరేయయ్యెన్

దాంపత్యపల్లవిం దళుకొత్తు చిన్నారిపూవు
పున్నామనరకంపు బులివాతి దప్పించు జోదు
దుస్తార వార్ధక్యతోయధిం దరియించు నావ
ఇహపరంబులలోన నిద్దసౌఖ్యంబొసగు సురభి

పావనాన్వవాయ పుణ్యభూమి
స్ఫూర్తిగొన్న పూర్వపుణ్యమూర్తి
పుత్రు దట్టి పుత్రు డొదవకున్న
జీవితమ్ము చేదుగాదె తాల్ప

అనియెంచుచు నానావిత
రణ పావనతీర్థనిషేవణముల్
ఇనచంద్రాదినవగ్రహ
వినయ సమాహిత విపులార్చనముల్

ఎన్నో సలిపిరి కానీ
యన్నియు నంబుధి జిలికిన
క్రొన్నన తేనియలయ్యేన్

ఎంతో వేచిరి కానీ
యెంత కమావాస్యా ని
శ్యంతం బొదవకపోయెన్

ఇది వారల మనముల
నెంతో దారించెన్
ఇది వారల మనముల
కింగలమే యయ్యేన్

వారి కన్నను వారి పితరుల
పాలికియ్యది శూలమయ్యెను
పిన్నవారల పెంపుతెంపులు
కన్నవారికె కావలెంగద !

అంతట నొకనాడా వృద్ధులు
అంచిత విజ్ఞాన సమృద్ధులు
ఆత్మజు, స్నుషనుం గనుగొని మది
నంటిన ప్రేముడి ననిరిటులన్

"నాయననారా ! పాయక సల్ప్రితి
రెన్నో వేల్పుల కింపగు సేవలు
కానీ కల్గదొకంతయు జిరుతని
దరహాససుధం దనిసెడు భాగ్యము !

మృగతృష్ణలకై యింతటి
యగచాట్లం బడనేలా ?
అందని మ్రాకుల పండుల
కణ్ణులు సాచగనేలా ?

చెంగట సురఝరి యనదగు
చెరువుండగ నింకేలా
తివురుట దవ్వుల సంద్రపు
తిక్తజలమ్ములకొఱకై ?

మఱచితి రేమది ? ఘనతర
కరుణారస పోషిత భ
క్త మనోరథతరునిన్ మన
గ్రామాంచితునిం బావని ?

భక్తజనావను పరమోదారున్
నక్తంచరపవి ననిలకుమారున్
త్యక్తమనశ్శంకాయతి నింకన్
భక్తిం గొల్వుడు; పడయుడు కోర్కెల్"

ఆయుక్తు లతులక
ల్యాణదాయక యుక్తులేయయ్యె
కారడవిలో పూల
దారులే వారికింగననయ్యె

అంతనొక కల్యాణ యామినీ ముఖమందు
సంతసమ్మున శిరఃస్నానమ్ము గావించి
కాంతతర శుభ్రాంశుకమ్ములం ధరియించి
కుంతలమ్ములు ముడిచి, కుంకుమంబును దాల్చి

వివిధఫలంబులు, వికచసుమంబులు
నవగంధంబులు, నారికెడంబులు
కపురపుతావుల గను వీడ్యంబులు
వెంటంగొని మదినంటిన కూర్మిన్

అపుడే యుదయంబందిన
అమృతాంశు కళాద్వయమో
యన క్షిప్రగతి న్నవమో
దాభియుతాంతరులై చని

హనుమన్మందిరముం గని
యందున నెలవౌ సారద
యాభిష్యంది కటాక్షున్
యాచక సాత్కృత మోక్షున్

ఘోరతరాఘావద్విని
వారణ కారణ కరుణా
సరసీ విహరత్ సజ్జన
సార సుహృష్టమనోహంసున్

పావన సూర్యకులార్ణవ
జైవాతృక నిరత స్మృతి
వేలా డోలాందోళన
లీలోత్సుక చేతోహంసున్

దుర్వారాసుర సేనా
గర్వోజ్జృంభణకీలా
నిర్వాపణ పర్వోత్సుక
దోర్వీర్యాతివిలాసున్

సుగ్రీవాధిప కుశల
వ్యగ్ర మనీషాన్వితునిన్
ఆగ్రామంబున భాసిలు
విగ్రహరూపాన్వితునిన్

ఆంజనేయుంగాంచి అధికతరభక్తి
నంజలుల్ ఘటియించి అలికమ్ములందు
కంజమృదులోష్ఠ రాగంబు గ్రాలంగ
మంజుభాషల నిట్లు మారుతికి ననిరి

"కామరూప! కామగమన!
కామితార్థదాత హనుమ!
రామచరణనళినభృంగ!
స్వామి! నీవె శరణు! శరణు!

అయ్యొ! ఇంతకాలమయ్యె! కలుగ
దయ్యె సంతు మాకు! వట్టిపోయి
కొయ్యబాఱినట్టి మ్రాకులట్లు
లయ్యె మాదు జీవితమ్ములిలను!

అసితపక్షకృశంబైన యబ్ధివోలె
అసితభానుమంతమైన రజనివోలె
మసృణ కుసుమ రహితమైన లతికవోలె
అసుతమౌచు జీవనసృతి వెలితివోయె

బహుశాస్త్ర పురాణంబులు
మహి "ననపత్యస్య గతి
ర్నహి" యనుగద! నీవెఱుగని
దేహనుమ! ఈశాస్త్రార్థము!

కావున నొక బలభూషణు
పావన గుణగణ భూషణు
మా వంశాంబుధి తోషణు
పావని యొసగవె మాకున్

త్వత్కరుణామృత ధారా
వర్ధిత మస్మజ్జీవనభూజము
దారుణ చింతా దావా
దగ్ధంబగుటోర్తువె భక్తావన !

తొలి యిలువేలుపు రాముని
నిలసుత గూరిచి వారల
యిలునిల్పితివట ! యటువలె
చిలికింపగరాదా నీ
చలువన్ మాపై కొంచెము
సులలిత కరుణా సుందర !"

ఈరీతి బ్రార్థించి హృత్తటాకోత్థిత
ఘనభక్తిరసతరంగక్లిన్న బంధురా
లోకమాలికలు క్రొంగ్రొత్త మందిరమునే
నిర్మింప బావనికి నీక్షించి రద్దేవు

వారి యాలోకములు బంభరశ్రేణులై
వాయుసుతు పదహృదయవదనాబ్జముల మూగె
అంతలో భూమీసురామ్నాయపాఠముల్
ఘంటికా ఘణఘణంఘణనాదముల్ మ్రోగె

మరుదాత్మభవు ఫాలమండలి నపూర్వది
వ్యాభమ్ము సద్యోభవంబయి పిసాళించె
అనిలాత్మభవు సుందరాపాంగములనుండి
కారుణ్యరసఝురులె కారుచున్నటు దోచె

తద్ఘన శోభా తరళిత పథిలో
మందిరమే యొక స్యందనమై వెలుగొందెన్
తత్కరుణామృత తరంగగతిలో
మందిరమే యొక మరాళమై చెలువొందెన్

అవ్వారి ఘననిరాశాంధీకృతాత్మలకు
ప్రతినవజ్యోతియై పరగె నారుక్ఛయము
అవ్వారి ఘనదీనతాతప్తమనములకు
పీయూషవర్షమై వెలసె నాదృక్ఛయము

గహనమ్ము గడచి రంగారుపురిజేరినటు
నీరాకరము గడచి తీరమ్ము జేరినటు
చండోష్మసృతి గడచి చలివెంద జేరినటు
వారునవమోద సంప్లావితాంతరులైరి

చింతాభారము దీరగ నెంతో తేలికలై
శంకాపంకము జారగ జాల ప్రసన్నములై
వారలమనములు శారదవారిదసదృశములై
నవ్యానందదివంబున నర్తింపగసాగెను

ద్విగుణీకృత కౌతుక ధీయుతులై
దేవుని గొలువగ గడగిరి వారలు

తమమనంబులయట్లు ధవళంబులౌ
కుందసుమబృందములు గురిపించి రొకకొన్ని
తమకోర్కెయటు నిత్యతరుణంబులౌ
లలితతులసీదళము లర్పించి రొకకొన్ని

సాంబ్రాణిధూపమ్ము, చందనవిలేపమ్ము
కాంచనీపంకమ్ము, కాంచనప్రసవమ్ము
సుఫలనైవేద్యమ్ము, చొక్కంపు వీడ్యమ్ము
చేకూర మారుతిన్ సేవించి రవ్వారు

ఈరీతి సేవించి హృత్క్షేత్ర
బంధురోద్యద్భక్తివల్లికా
సంచలచ్ఛదన నిస్వానమో
యనమీరు నుడులార ననిరిట్లు

"దేవా! నీకనుచలువయె
మావాంఛితదమ్మగు కల్పద్రుమవు!
దేవా! నీవాత్సల్యమె
మావంధ్యత్వము మాపు మహౌషధి!

నీవె శరణం బంటిమయ్యా!
నీకె దాసుల మంటిమయ్యా!
నీట ముంచిన పాల ముంచిన
నీదు చలువే నంటిమయ్యా!

వందనము నీకమరవందితచరణా!
వందనము నీకసురవారణచరణా!
వందనము నీకఘవిపాటనచరణా!
వందనము నీకర్థిపాలనచరణా!

అని ప్రార్థనము సేసి, అనిలాత్మభవు తీర్థ
మాల్యగంధాక్షతామూల్యప్రసాదముల
నాదృతిం గ్రహియించి, హనుమత్పదన్యస్త
హృదయులేయయి వారలిలుజేర జనిరంత



ఆలయ దర్శిత శుభచి
హ్నాంకితమతులై వారది
యాదేవుని దీవనయే
యనిమెచ్చుచు గనుమోడ్చిరి

దుస్తారపాథోధి దుదముట్టగా నీది
బిట్టలసి నిదురించు బెస్తరాయనిబోలె
తక్షణమె నాయండు తంద్రాళువై పోయె
కాని యన్నమకేమొ కన్నంటదెంతకును

ప్రసవము దొలగిన వెనుకను
విస్మరమగు తావింబలె
శ్వసనజు సన్నిధి ఘటనమె
మెసలెను మదిలో నామెకు

అగునాయది మాప్రార్థన
కనిలజు డొసగిన యభయము ?
అగునాయది మానోము ఫ
లాస్పదమగు శుభశకునము ?

మున్నట గొల్చితి మెన్నో
మూర్తుల గానీ యిట్టి మ
హానుభవం బెందుం బొడ
గానము; అద్భుత మియ్యది !

ఇనన్ సూనుడు, సద్గుణసూనుడు
అన్వయదుగ్ధాంబుధిహిమభానుడు
ఘనతేజోవిధినిర్జితభానుడు
కల్గునమఱి ? నెమ్మది కల్గున మది !

పసిపాపని చిఱునగవుల
నెసలారెడు వెన్నెల తర
గల దేలుట యెన్నడు ? మై
పులకల నూనుట యెన్నడు ?

ఏమో కావుగదా యివి
యెల్లయు నలలన్ వ్రాసిన
వ్రాలే ? మృగతృష్ణం బ్రతి
భాసించెడు నీరములే ?

ఓహరిసాహరిగా నిటు
లూహలు చెలరేగగ నా
యమ మానస మంబుధి నూ
గాడెడు నోడం బోలెను

పలుతెఱంగుల నిట్లు దలపోసి తలపోసి
తరళాక్షి క్రమముగా దంద్రాళువై పోయె
సంక్షోభముం గడచి శమియించు సాగరము
చందాన నామెమది శ్రాంతించె నొకయింత



భువనంబు రంగారు పూదోటయై పొలిచె
పవనుండు మందుడై పరిమళించుచు నడచె

భువినందిన నందనవనమై
పువుగొమ్మల యిమ్ములకిమ్మై
నవజాలక జాలక మయమై
పువుదోటానరె న్నిరుపమమై

సుడిగొంచు జరియించు సుమరజమె కండ్లుగా
పొలుపారు చూతాగ్రముల చివురు డెక్కెముగ
కడునెడుదలౌ క్రముకకాండములె నొగలుగా
తగబారులౌ తేటిదళములే త్రాళ్లుగా
చిల్కతండములె మేల్గులు తురగమ్ములుగ
కోకిలమ్ములె పరాకుల్కు వల్కు జనముగా

తనరంగ జైత్రయాత్రాశీలి చైత్రుండు
దివినుండి భువిజేరు తేరునా వనమొనరె

అలరుల యక్షత లివురుల
హారతు లళిరవ గానము
లలరగ స్వాగత మొసగిరి
ఆమనికి లతాకాంతలు

తన కీర్తి సౌరభమె తావిగా నవరించి
తన స్ఫూర్తి గనకంపు దనువుగా నమరించి
తన మధుపలౌల్యంబు దనలోనె మిగిలించి
ఒనరించె జైత్రుడన నెనయించె గాంచనము.

క్రమ వనకామినీ గండముల ననురాగ
నమ్రాంతరంగుండు నవచైత్రు డొదవించు
నామ్రశరకీర్తి చిహ్నోయమానార్ధేందు
క్రమాంకముల బోలె కలికి మోదుగుపూలు

బాల సహకార మృదు పల్లవమ్ములు మెసవి
పంచమంబున బాడు పరభృత ప్రకరమ్ము
లామెతల్ భుజియించి ఆరామలక్ష్మి పై
దీవెన ల్గురిపించు ద్విజరాజియే సుమ్ము

చివురు గొమ్మల డాగి యెవరికిం గనరాక
భువినెల్ల మృదుగాన వివశత్వమున ముంచె బరభృతము
భువనైకగీత పరిపూతమూర్తుల కేల
యవసరం బిల భౌతికాకార లీలాప్రదర్శనము ?

మకరంద మధుపాన మత్తతం దేలియున్
ఝంకార సంగీత సర్వజ్ఞత న్మీరె
మధుపకుల మయ్యారె ! మాధ్వీక లోలుపుల్
గళిత సంస్కారులను గాధ అనృతమె కాదె ?

చలమూర్మికా సంఘ సంఘట్టనోదిత మృదంగ
లలిత సంరావానులాస్య న్మయూరంబు
విచల వీచీ లుఠద్విస్తారతర పృషత్తార
నిచయ భాసుర రమ్య నీరేజపర్ణంబు

అనుచల ద్భృంగ నివహాందోళికా విహరమాన
మానసౌకః కదంబానంద నిలయంబు
ఉరుతరంగాకస్మికోడ్డీనమాన శిశుమీన
చౌరికావహ సవిధ జలపక్షి నివహంబు

కూల మాలూర గాలవ క్రోడ వాసి
బహువిధాండజ సంగీత పరిణతంబు
కమలినీ వృద్ధికారక ఘనరసంబు
నగుచు జెలువొందె వనియందు నబ్జసరసి

కిసలారుణ వసనములున్
కుసుమాలంకృతులుం జేకుర దీరలతాంగీ
విసరము గై సేయగ వని
పొసగించిన దర్పణమన బూసరసింపెసగెన్

మొదట తావుల జల్లి దెసలందు మోహార్తులం జేసి
పైని రుచిరాస్యాబ్జముల జూపి పరవశింపం జేసి
ఉపరి ముఖసీధువుం జవిచూపి ఉన్మత్తులం జేసి
భ్రమరులం జొక్కించె పద్మినీ ప్రౌఢాంగనాకులము

చెలువునన్ శతపత్రములకోడి మునిగెనో
చలినీట నన దోచె జలజాకర స్థగిత
కూలాంత కుందసుమకుల మౌర ! విభ్రమ ర
మాలయుల గెలువంగ నగు నేరికిం దరము ?

సంచరన్మధుపాళి జయజయా రావముల్
సంపతచ్ఛదనాళి సన్మాన పత్రముల్
ఉల్లసన్నవ కాంచ నోపాయనంబులున్
సమకూడ వని గాడ్పుకొమరు నాహ్వానించె

కన్నెమావుల తావి కమనీయ మౌనంచు
క్షణమాత్ర మవ్వాని సరసనం జరియించు
కన్నెమావికి మిన్న పున్నాగమని యంత
పున్నాగముం గాంచ బొరిబొరిం గమియించు
కన్నెమావిని బొన్న గాల్దన్ను గాంచనం
బని దాని జేరంగ బడిబడిం బ్రసరించు

తాలిమిం దూలి గంధానిలుం డిట్లు
చంచలాత్ముల కెందు జరణంబు లాగునే ?

ముందుగా మృదుకిసల సుందరాంగము లంటి
తదుపరిన్ మంజరీ స్తనకంచుకము లంటి
పిమ్మటన్ నిలువెల్ల బిమ్మటి గొనం బెనగి
మంజరుల గామించె మలయానిలవిటుండు

ఈ దృశ సుందర వనమున
నెసగెడు విహరణరతి ని
ల్చిన దన్నమ సురవని బో
ల్చిన యింద్రాణీ విధమున

చూతము జూచుచు, గుసుమ
వ్రాతము గోయుచు, గోకిల
రవములకుం బ్రతివల్కుచు
బువుటూయలలం దూగుచు

ముఖపద్మముపై విసవిస
ముసరెడు దేటుల కలుగుచు
బింబోష్ఠము గాట సమీ
పించెడు చిల్కల కులుకుచు

పుష్పొడి కుప్పల ద్రాకుచు
పూదేనియ నదు లీగుచు
నలినమ్ముల మొగిడించుచు
దెలికల్వల బొదరింపుచు

సారంగంబుల వాల్గను
సన్నల బాఱంద్రోలుచు
చక్రాంగంబుల బదహం
సక రవముల నులికించుచు

మాటల గోగుల, పాటల మహిళల
కవుగిట గ్రోవుల, నవులం బొన్నల
ముఖరుచి మావుల, ముఖసుర బొగడల
ననిపించుచు, జిగి నంతట నించుచు

మది దొట్రిలు సమ్మదపుంఝరమున
బ్రసవోత్కటు రసవాహిని మించుచు
ధర మెట్టిన యచ్చర బురుడించుచు
జరియించె వనాంతరమం దన్నమ

ఈరీతిం జరియించుచు
నారీమణి యెదుటం గనె
నిరతమరందాసారము,
పరిమళ వివశీకృత మా
రుత సంచారము, వ్రతతీ
భృత వివిధ సుమాలంకా
రము, బంభర మృదు ఝుంకా
రము, నొక పువుటీరము

ఆవృతాగమ కల్పితాంధకారము బాప
బంధూక మణిదీప వర్గముల వెలిగించి
పరజనాహూతి దెలుపంగ శుక పిక చార
నివహాల నుండంగ నెల్లెడల నియమించి

మధుప తేజోబలము
మాధవు కృపాబలము
వెలయ బాలింత్రు దీ
వియకన్నె లీరమ్ము

ఈదృశ మేదుర కుతుకో
త్పాదక కుంజాంతమునం
గదలుచు దోచెన్ విశదా
కారం బొక్కటి యంతట

నడయాడు రజతంపు బుడమిత్తాలుపో నాగ
బెడగారు పాల్కడలి ఫేనంపు భరునాగ
కదలి వెడలిన సురల కంఖాణమో నాగ
పుడమి నిల్చిన వేలుపుందొర గజమొ నాగ

బెడగై, దంతద్వయ రుచి
కడలన్ వెన్నెల నించగ,
తొండము హరిసేవక కర
మండిత కలధౌతోజ్జ్వల
దండంబును బురుడించగ
నిండగు నాకృతి నీరజ
వైరిన్ స్పర్ధించెడు నవ
ఖాపుంజము లొలికించగ,

ఖండిత వృక్షక కాండాంచితమై
క్రందన నినదంకర దిక్తటమై
శారద నీరద చందన సుందర
సితసింధురమై చెలువొందినదది.

ధరపై ప్రాకెడు బృహదవ
దాతాంబుద మా గజమా
కుంచింపగ సాగెన్ హరి
యించుక పోయెడు కపురవు
సంచయమన నంతంతకు.

ఏమిటి ? ఈ కుంజం బేమిటి ?
ఈ మత్తద్విరదం బేమిటి ?
కొండ కరంగిన విధమున నది
కుంచించుట యిది ఏమిటి ?

అని విస్మయ వివశీకృత
మనోంబురుహయై, అనిమీ
లిత నేత్రద్వయియై, వ్రే
లిడి నాసం, దిలకించెడు
నన్నమ నా ద్విరదం బల
నల్లస దరియంజని, అణు
మాత్రంబై త్రుటిలో న
మ్మానిని గర్భము జొచ్చెను

అననుభూతపూర్వ మతుల విస్మయావహంబునై
ఆఘటనము మేన వే ఘటింపగాను బుల్కలన్
మనము వడక, స్వేదకణము లుద్గమింప డిగ్గునన్
చెంత నున్న మ్రాని జెలువ కౌగిలించె బిగ్గఱన్

అంతలో నా దృశ్య మంతర్హితంబయ్యె
నుంత మేల్కాంచి చెలి ప్రాంతంబు నీక్షించె
కాంతార భూజమ్ము గలచోట కాంతునిన్
వింతగా గని కాంత వ్రీడనా కుంచించె

అన్నమ ! అన్నమ ! నా బ్రతుకున
పున్నమ ! యేమిది ! యేమిది ! కల
యో కాంక్షయొ, వెఱపో వెరగో
యే కారణ మీకలవర మోచెలి !

అను నాయకు సాంత్వనములచే
నాయమ పూర్తిగ నందెను జాగృతి

మఱునాడు జోస్యులా తెఱగెల్ల నాలించి
శిరము పంకించుచుం, జెక్కునం జెయి చేర్చు
చున్, బ్రుకుటి ముడివెట్టుచున్, యోజ గావించి
అనిరిట్టు లమృత ధారానుకారోక్తులన్

"ఆరామదర్శనం బతి శుభవ్యంజకము
సితగజము సత్వమున కతిమాన్యతకు జిన్నె
అది గర్భముం జొచ్చుటగు భూరిసత్వుండు
నతులమాన్యుండునౌ సుతు డౌదవు చిహ్నమ్ము

సుపవిత్రుడు, స్మరసుందరగాత్రుడు
సజ్జనమిత్రుడు, జ్ఞానకళత్రుడు
విక్రమ మిత్రుడు, విమతిలవిత్రుడు
కల్గును పుత్రుడు, ఘనచారిత్రుడు"

ఆ మాటల నా మిథునము
మోములు వికసిల్లెం దొలి
వెలుగున్ రేకల విచ్చిన
వెయిరేకుల తమ్ములవలె

ఆ మిథునము కనుగొలకుల
నానందాశ్రులు గురిసెన్
అందున శంపానిభమున
ఆభమ్మెదొ తలసూపెన్



# ద్వితీయాశ్వాసము

కొన్ని నాళ్లకు అన్నమాంబకు
కానవయ్యెను కౌను కొంచెము
జానువాఱెను మేని చాయయు
మంజువయ్యెను మందగమనము

నాయకున కీవార్త సుమనోజ్ఞ
గేయమున కన్న ప్రియమయ్యెను
నాయకుని డెందమం దొకటియా
వేయి హరిచాపములు పూచెను

ఆమె గర్భము నందునన్
వంశతారక భవ్యరూపము
ఆమె మూర్ధము నందునన్
తృప్తిపరిణత దివ్యతేజము

ఆమె చెక్కుల
నమృతదీధితి హల్లీసకమ్ము
ఆమె దృక్కుల
నమృతధారా వ్యావర్తనమ్ము

ఆమె యోష్ఠము లందు
స్నిగ్ధతర ప్రత్యగ్ర చిత్రరాగమ్ము
ఆమె యూర్పుల యందు
హైమంత గంధవహానాలసత్వమ్ము

ఆమె యొడి యందు
డినదినావర్ధిత మసృణ వర్తులత్వమ్ము
ఆమె నడ లందు
మత్తమాతంగ పద మధురవిన్యాసమ్ము

కాంచి నాయం దంచిత ప్రమ
దార్ణవ ప్లవనాప్తి మించున్
కాంచి నాయడు మంచుగుబ్బలి
మించు ముదమెద నించి మించున్

ఈవిధి ప్రతిదివసావర్ధమాన
గర్భాన్వితయై కాంతారత్నము
వొలిచెన్ వర్షాభోగంబున బెం
పారిన గోదావరి చందంబున

నిండునది బోలు నా నీరజేందునిభాస్య
ఇందు నీరజబంధు లిమ్ము లొనగెడు వేళ
ఉడురాశి కూటంబు లుత్తమం బగు వేళ
మాసములు నిండి యొక మగనిసుంగును గాంచె

ఫలియించిన పంటవలంతియొ
యన మించిన యతివం గను పతి
కృతియౌ భూపతి దలపించును
అతి సమ్మదస్మృతి బయనించును

ఆత డామెను జూచుచుండు
నామె యాతని జూచుచుండు
నిర్వైరుం గూడి యానిసుగు
నింపునింపుగ జూచుచుంద్రు

అటు గాంచుచు నాయర్భకు
డెటు దేలునొ యని యెద నెంతురు
ఎటులేమిటి ? సుజనేడిత
పటుగుణుడేనని భావింతురు

అటు జూచుచు నాయండను చెలి ! నీ
ముఖ చంద్రాంశమ్మానుట గాదా
సురుచిర మగు నీ చిరుతని వదనము !

అన నగి యను నాయంగన స్వామీ !
మీ మృదుహాసపు కౌముదులే కద
మన తనయుని మోమున మొలకెత్తెను !

ముద్దదాసానంపు ముద్దుచెండును బోలె
మెత్తనౌ యాశిశువు నెత్తుకొందురు వారు
ఎత్తుకొని యెద గూర్మి హత్తుకొని యనుకొందు
రనిలజాశీర్జనిత మణియె సుమ్మిత డంచు

హనుమత్కరుణాశీకర
జనితాంకురమైన యాత్మజాతున కెలమిన్
హనుమప్పను నామంబిడి
హనుమంతున కెరగి వార లనిరిటు భక్తిన్

త్వత్కరుణారస బంధుర తటాక
భవ తరుణాబ్జం బగు నీతరుణుని
తావక బహుతర ధామార్కాంశ
ప్రసాదకలనం బాలింపుము దేవా !

కైరవాప్తు కిరణపాళి కైరవాళి కైన యటుల
శ్రావణాంబుధరము సకల సస్యతతుల కైన యటుల
అల వసంతు డఖిల తరులతాది వితతి కైన యటుల
ఈనిసుంగు జీవనసృతి కీవె తరణి వయ్య హనుమ !

నీవే తండ్రివి
నీవే గురుడవు, నీవే సర్వము మాకున్
నీవిస్తృత కరు
ణావిలసనమున బ్రోవుము నిరతం బితనిన్

నిరత సాధురక్తి నిష్ఠుర విముభక్తి
నీకు సొమ్ము లంట నీరజాప్తతేజ !
నీదు భూష లొసగి మాదు సుతుని సుంత
అలంకరింపవయ్య ! అనిల కుమార !

హనుమప్ప కంటిచలువన్
హనుమప్ప గనియె క్రమక్రమాభ్యుదయంబున్
ఘనవర్షోదయ జృంభిత
వనాంతర నవీన నీపవల్లిక వోలెన్

ధర్మపథ మందు నిరతంబు బదమూను
మర్మ మెఱిగెనొ బాల్యమందే యనంగ
హల్లకారుణ పల్లవాంఘ్రుల ధరిత్రి
నల్లనం బూన్చి నడయాడగా నేర్చె

కదలెడు పుత్తడి బొమ్మయొ
మెదలెడు చివురుం గొమ్మయొ
యని చూపఱు లబ్బురపడ
ననువారసి యతడు గమించెన్

ఋతవాక్యంబుల బల్కెడు
వితముం గన్గొనె నతిబాల్యంబుననే యన
నతని ముఖంబున వెల్వడె
శ్రుతి కామెతలౌ సుందర మృదుభాషితముల్

చిఱుగాలుల రవళించెడు చివురాకుంబలె
చిఱుదేటుల రవమూనిన విరిపోవుంబలె
స్వరమూనిన హాటక పాంచాలికయుంబలె
పరగెన్ బాలుడు వాక్సంభవ శుభవేళన్

శ్రీకంఠ చాప ఖండన యన
చీకంట చాప కందన యనుచున్
పాకారి ప్రముఖ వినుత యన
పాకాలి వ్వముక వినుత యనుచున్

ఆకుఱ్ఱడు ప్రతిపల్కం
జేకుర విధాత చేసిన
శ్రీకర నినదంకరాతి
లోక ధ్వనియంత్ర మనన్

పలుకులు నేర్చిన దాదిగ
పొలుపుగ భారత గాథా పూరమె దశకం
తలవిత్తు కథాసారమె
పలికించి రతనిచేత న్వారక పితరుల్

అఱపదేండులు దాటని యలతినాడె
ఏకలవ్యుని చారిత్ర మెక్కె మదికి
కరతలామలకం బయ్యె గర్ణగాథ
ఆంజనేయుని విక్రమం బాత్మ నాటె

ఆనాడే యతడా వీరుల బ్రథ
మీరెడు నాశోస్మి లనమున దేలెన్
జనియింపగనే శర్వుని తలకే
పూవగు తహతహ బూనిన నెల వోలెన్

పక్షి యట్టుల నంతరిక్షమున కెగయంగ నెంచు
మత్తగజ మట్టులన్ మల్లాడగా నుత్సహించు
తురగమ్మ రీతిగా దూకంగ గుతుకమ్ము నించు
ఆబాలు డాటేందు లైన నింకని యలతినాడె

తోడి బాలుర గూడి యాడెడు
వేళ లందున విజయ మతనిదె
వారు డాగిన వారి ద్రుటిలో
నరయు నాతడు; అతడు డాగును;
మాఱు మూలల వార లరయుదు
రైన గానక నాన దాల్తురు

లేడిపిల్లల లీల బాలకు
లోలి గట్టుక నుఱుక నేర్చెద
రట్టి వారల యందు నెప్పుడు
నతనిదే యగు నగ్ర గమనము

కట్టితున్కల గేల గిట్టునం ద్రిప్పుచున్
కుట్టలం గూడి రణకుర్దనమ్మున మించు
గుట్టంపు గూనపై కుప్పించి కూర్చుండి
అట్టి కేలం దిగిచి యద్దాని నుఱికించు

బాలురందఱు భారతక్రీ
డాత్తులైనపు డాత డర్జును డౌను
వారు రాఘవ వీరగాథా
నటకు లగుచో నత డనిలజుం డౌను

వేళ లందున నొక్క పూలవేళయు బోలె
పూల యందున నొక్క పుష్కరమ్మును బోలె
రాల యందున నొక్క రత్నాంకురము బోలె
బాలురందున మేటిబాలుడై యతడొప్పె

బాలార్క తరుణాంశు జాలంబు మధ్యాహ్న
కాలోద్ధురాతపక్రమము దెల్పెడు రీతి
బాలకుని శైశవప్రారంభ వర్తనమె
పోలంగ నాగామి భూరి విక్రమ వృత్తి

బోయ నాయడు పుత్రరత్నము
జేయ నెంచెను సిద్ధహస్తుని
అస్త్రవిద్యల, శస్త్రవిద్యల
మల్లవిద్యల, నెల్లవిద్యల

ఒక భరతునిగా నొక పార్థునిగా
నొక భీష్మునిగా నొక భీమునిగా
నకలంకస్థితి నాత్మజు మలచం
బ్రకటంబై తగు వాంఛన్ బోయడు

మేటి ధానుష్కకోటిలో మేలుబంతి
ఊర్జితాహవాభిజ్ఞుల కొజ్జబంతి
అలఘునై త్రింశికాళుల తలకు బంతి
కాగ నొనరించె బాలుని గడక మీర

తండ్రి పనుపున నేర్చెను తనయు డంత
గంధవారణ వారణ కలితవృత్తి
నతుల జవనాశ్వ చాలన చతురవృత్తి
బహువిధ శకటచోదన ప్రథితవృత్తి

అవిరళ శరజాలంబులు
ప్రవిభీల గుణస్తనిత విరావంబులు చా
ప వృషేష్వాసంబులు దగ
బ్రవిభాసిలె శ్రావణాంబువహ మటు లతడున్

తఱుగని శరధుల శరముల నొనరుచు నా
చిఱుతని కార్ముక శరధర మేర్పడ గుఱియున్
శరములు తద్వర చాతుర్య వృషాజ్ఞా
పరిలక్షితమౌ ప్రాంతంబుల నేమఱకన్

అతడు ఖడ్గవిద్యాభ్యాసి యైన వేళ
చంద్రహాసాంచల స్ఫురత్ చంచలాళి
తత్ప్రగాఢ తేజోభవద్భావికీర్తి
రేఖికా స్ఫోరక నిమిత్తరేఖ లగును

కాపురుషోదయ ఖండన చణముల్
ఆపుష్పిత పూజ్యాంధ్రరమా భా
గ్యాపహరణ చణ యావన ఘనావ
లేప నివారణ లీలోత్సుకముల్
ఆపాపని ఖడ్గాశీవిషముల్

పుట్టువొందిన నేమి బోయకులమున యందు
రాణించె నాతండు రాజవిద్యల యందు
గర్హ్యమౌ పంకమున గననేమి జననంబు
ఆమోదయిుతి నర్హమౌ గాదె నళినంబు !

అతడెట్టి యశ్వంబు నైన నవలీల
బట్టి మారుతమట్లు బర్వు వెట్టించు
అతడెట్టి యశ్వశిక్షాభ్యుచిత విద్య
నైన నిష్ణాతుడై యలరు ద్రుటిలోన

క్షీరసాగర మథనంబు సేయు వేళ
నొనరు నావర్తమున దగుల్కొనిన వేల్పు
వార్వమే సుమ్మతం డతిత్వరిత గతిని
సారెవలె ద్రిప్పు నాత్మీయ సైంధవంబు

ఆవకోధ మొదవుచో నశ్వంబు దాటించు
ఖగమట్టు లెగిరించి గగనంబు నంట
మడుగు లెదురైనచో మత్స్యమటు లీదించి
సైంధవము దరిమించు జాతుర్య మెసగ

సమయ మరుదైనచో స్వశనోపమ జవాప్తి
దురగమ్ము నుఱికించు దూర్ణమ్ము గాను
సమయమ్ము గల్గుచో సామజోపమ లీల
వాజి నడిపించు బహురాజసము గాను

ఘోటక స్వభావ విశేష కోవిదుండు
సప్తి పాలన విద్యా విశారదుండు
తురగ చాలన చాతురీ పరిణతుండు
ఆశ్వికవరుం డతడు హనుమాభిదుండు

మొగ్గ కుసుమితమైన మురువొప్ప నతనిలో
నగ్గలంబయ్యె నవయౌవనోదయము
ముగ్గువెట్టిన రీతి ముఖచంద్ర మండలిన్
నిగ్గు దేఱెను శ్మశ్రు నీలరేఖికలు

నూనూగు మీసాల నూత్న యౌవనము
నాటికే వీరులన్ మేటియై యతడొప్పె
బాలుడయ్యును మున్ను వాసుదేవుండు
వాసవాసహ్యమౌ వరశక్తి మనకున్నె ?

పసిడిం గూడిన వాసన వోలెన్
కుసుమారామము గూడిన చైత్రము వోలెన్
నిసి గూడిన వెన్నెలవస వోలెన్
పొసగెన్ యౌవన పూర్ణోదయ మాతనిలోన్

మిసమిస లారెడు మీసంబుల
ముసరెన్ నవ దరహసితపు రోచిస్సులె !
వసివాడని ముఖపద్మంబున
హసించె బురుషార్థంబగు వర్చస్సులె !

శైశవంబున పేశలంబయి
పొనరు తనువున కొనరె దార్ఢ్యము
కండ నిండెను కాయయష్టిం
జీవురుగొమ్మయె చేవ యయ్యెను

ఆయతంబగు నతని వక్షము
గవని వాకిటి గర్వ మడచెను
అతిదృఢంబగు నతని బాహువు
లయోర్గళముల నవహసించెను

మొలకగడ్డపు ముసుగు దొడిగిన
అతని చెక్కిళు లందగించెను
జలదశకలము సగము గప్పిన
పూర్ణచంద్రుని పొలుపు దెగడుచు

ఫుల్లనీరజ పూర్ణముఖమున
బారుదీరిన బంభరమ్ములె
అతని మీసము లందు దవిన
వారిపర్ణియె బవిరి గడ్డము

ఈవిధి ననుదిన వర్ధిత
యౌవన విభ్రమ పరుడగు నాత్మజు గని రా
కావిధు దర్శన తృప్త ప
యోవార్నిధి భంగి పొంగి రాతని పితరుల్

పరిపర్ణింపగ వారల సుఖముం
దరమా వాక్కులకది విధి దత్తేక్షణముల్
దరియింపగ ప్రత్యక్షంబుగ బొరి
నరయగవలె. మెచ్చుచు దల లాడింవగలెన్

వా రొకనా డాత్మజు గని
స్మేరానను లౌచు సుతుని సేమమె మదిలో
తోరంబై చన బల్కిరి
సారామృతమయ హితోక్తి సంతతి నిటులన్

నాయన ! యెన్నో రాజ
శ్రేయస్కరమౌ విద్యల
గడిదేరితి విదిసరి ! ఈ
గ్రామంబున నేకరణిన్
రాణించును నీపొండితి ?

అడవిం బూచిన యలరుల
యందం బేరికి దెలియున్
అడవిం గాచిన వెన్నెల
లలరించెడు నెవ్వారిని ?

రాణించును గాదా మణి
రాజము ధర్మాశ్రయమున రంజిలుటన్
రాణించును గాదా ఫణి
రాజు మురారికి జాజుల పాన్పగుటన్

కావున పాండితి గౌరవ మందును
విజ్ఞులకడ వినవే "విద్వానే
వ విజానాతి విపశ్చిత్క్రుత సుప
రిశ్రమ" మను సూరి సుభాషితముల్

తన యర్హతకుం దగునెడ గానీ
మనుజుడు గానడు మాన్యత; అందున్
రణవిద్యా పారగులకు బరమము
మనుజాధిప సేవన మట్లగుటన్

మన గద్వాల పురీశుడు
మన యేలిక సోమనాద్రి మహివల్లభు వా
హిని లోనం గలరెందఱొ
ఘనవీరు లనూనధామ ఖరకరమూర్తుల్

నీవా వీరుల జేరం
బోవుట తావక భవిష్య పూర్ణాభ్యుదయ
శ్రీవిధి మూలంబగు; మా
కీవిధి మోదావహంబు; హితమనిపించున్

నీకడిమిన్ నీ నిస్తుల రణపాం
డితిగని పరీక్ష నిర్వర్తింపం
దగు నాధాత్రీధవ సంస్థాన
స్థమహావీర వతంసమ్ములకే !

అనయవాక్యము లమృతపు
సోనల పొందై యపూర్వశుభదములౌ స్వ
ర్ధేనుపయోధారల క్రం
దై నవమోదాంకురముల నాత్మం గూర్పన్

హనుమప్ప యుప్పొంగె
పెనువెల్లువై పాఱు ఘనవాహినిం బోలె
హనుమప్ప యుప్పొంగె
పెమనుర్గులం బొంగు పీయూషముం బోలె

హనుమప్ప కన్గొనల
తొలుకారు మెఱుపులే తొనకారె
హనుమప్ప మెయినెల్ల
లలితంపు బులకలే మొలుపారె

గద్వాల సంస్థాన గరిమంబె
మైరేయమై యతనిమై మత్తునం దేల్చె
బహుభావ బంధురంబౌ యతని
వక్త్రంబు రక్తశతపత్త్రిఃబునే గెల్చె



# తృతీయాశ్వాసము

అతిభయంకర తురుష్కాధిపత్యము వోలె
ఆతతంబయ్యె నపు డాంధ్రదేశము నందు
వీతసుఖు లాతురితచేతస్కులై జనులు
సీతువుగ గంపింప శిశిరర్తు సమయంబు

దారుణ తురుష్క ధాటీ
దారిత దేవాయతన విధంబున దనువుల్
సారపు బగుళ్ళు సూపెను
తోరంబగు శిశిరధాటి ద్రోవగ లేకన్

యవనధాటులు మాంగల్య మపహరింప
గ్రిందువడియున్న యాంధ్రరాజ్యేందిరాస్య
రీతి నూర్జిత హిమపాత ఘాతి జెలువు
దక్కి స్రుక్కెను గొలకులం దమ్మిపూలు

వాలాయముగ నాల వధియించు యవనాళి
కులదైవముం గూడు కొఱకేమొ తపనుండు
చల్లబడి పరువెత్త సన్నబడె పవలౌర !
చెల్లునా లోకాప్తచిహ్న మీ దృశునకున్ ?

కాంతతరమౌ శరత్కాలమ్ము నెడలించి
ఈ సీతు వేలకో యల నించినావు ?
మందిరమ్మును గూల్చి మసీదు నిల్పినటు
నీ లీల విధి ! చాల నిష్ఠురముగాద !

అని త్రస్తాంతరులై శీ
తానిల సంస్పర్శన సం
స్తంభిత తనులై జనులం
దఱు విధి దూరిరి ; పీడా
ర్తులు శ్రమ మీగతి మఱువం
దలచుట పరిపాటియె కద !

ఉత్కటమగు శైత్యోద్ధతి నుత్పాటింపగ
కొయ్యల బేరిచి జనములు గూర్చిన మంటలు
యవనౌద్ధత్యము బాపగ నాంధ్రుల మనముల
గెరలెడు పౌరుషరేఖాకీలల బోలెను

ఘోర యవనాధికారంబు గూలద్రోసి
ధర్మ సంస్థాపనము సేయు మర్మ మిదియె
యనుచు గూఢలిపి దెనుంగు జనుల కజుడు
వ్రాసిపంపిన జాబులో వ్రాలు నాగ
శాద్వలంబువ హిమబిందు సంఘ మమరె

అదియె సందేశ మాత్మలో హత్తుకొనగ
ఆంధ్రులుప్పొంగి యవనాళి నవల ద్రోలి
ఆంధ్రికిం బట్టముం గట్టునట్టి వేళ
జలజలం గురిసిన పైడిజల్లు వోలె
బంతిపువుల డాల్గ్రాలె హైమంత వేళ

తెనుగుతల్లి వైభవంబు తిరిగి నిల్చునట్టి వేళ
సమయమాగధుండు సంతసమ్ము నిలువబట్టలేక
ప్రస్తుతింప బట్టినట్టి పసిడిబావుటాలె సుమ్మ
పల్లెసీమలందు బరగు పచ్చగుమ్మడి విరిదిమ్మ

ఆంధ్రభూరమ పాపట నందగిల్లు
క్రమ కుంకుమరేఖికా కాంతి వోలె
పల్లెసీమల యందెల్ల బరిఢవిల్లె
మిరపపండుల నవకంపు మిసిమిపిండు

పండి కోయంబడిన పంటకొయ్యలు మగుడ
నిండె నిగురులనంత నీహారమున దోగి
ఖండితములే యయ్యు నిండారు విజిగీష
వెండి మొలచిన యాంధ్రవీర్యాంకురములట్లు

ఇరుల బోలిన నెఱనీలి కురుల లోన
తారలటు బంతి చేమంతి తలిరు లూన్చి
కలువకన్నులు, నవుల వెన్నెలలు జెలగ
రేలు రచియించి రిలను పూర్ణేందు ముఖులు

స్వర్వేణితుల్యమ్ము, సర్వాఘ తరణమ్ము
సర్వాంధ్ర జనసౌఖ్య సంధానకరణమ్ము
మహితాంధ్ర మండలీ మంజులోద్యానమ్ము
రహియించె నవ్వేళ రమ్యమై కృష్ణమ్మ

ప్రథమకవి నన్నయ్యభట్ట కృత భారతాం
తర సుప్రసాదగుణ భరితాంతరము తోడ
ఆంధ్రకవిసార్వభౌమ రచిత బహుకావ్య
మాధుర్య గుణధుర్య మధురాంబువుల తోడ
సహజపండిత కావ్య సరణి మండిత పద
క్రేంకార సంకీర్ణ కీలాలరుతి తోడ
అష్టదిగ్గజ యూథపాప్సరో నాయికా
ఘూనర్త నోపమాంభోవర్తముల తోడ

లలిత వర్తుల ధవళ సైకతశ్రోణి
పరమహంస మోక్షపద్ధతి నిశ్శ్రేణి
ప్రాక్పయోధిరాజు పట్టపుదొరసాని
నయనపర్వ మయ్యె నపుడు కృష్ణవేణి

శమనస్వసాతటీ సరసకేళీలోల
వాసుదేవాసక్త వల్లవీ తనులత
ఛ్వేత చేలాంచలము లాతస్వి వీచికలు

నందనారామ చందన తరుచ్ఛాయా
కందుక క్రీడాత్త బృందారకాంగనా
బృందిష్ఠ పదకటక బృంహితము లా రొదలు

ఉప్పొంగు కృష్ణమ్మ యూర్మికల బెల్లుబుకు
విస్మృతాంధ్ర క్ష్మాప విభవచరితంబులే
పెల్లడరు కృష్ణమ్మ వెల్లువల రొదలోన
వినిపించు దదనూన విక్రాంతిగీతులే

ఆవీచికల గాంచి
ఆపులకితాంగుడౌ బధిరుడైనన్
ఆ రొదల నాలించి
ఆపులకితాంగుడౌ నంధుడైనన్

భరతనాట్యాచలత్ భామినీ శ్రోణితట
నటదతుల పటుదీర్ఘ కుటిలవేణిక వోలె
స్ఫుటమయ్యె బులినాల స్ఫటివోలె జుట్టుచుం
బాఱు నవ్వాహినీ భవ్యతర వేణికలు

ఆమె పావన వారి అభిషేక మొనరించె
నో యెన్ని అవనీశ్వరోత్తమాంగమ్ములన్
ఐక్యమై పాఱెనో ఆమెజల మెన్నెన్ని
రణరంగసంస్యన్న రక్తభంగమ్ములన్

ఆమె యెఱుగని యట్టి ఆంధ్రచారిత్రమే లేదు
ఆమె అరయగ లేని ఆంధ్రభవితవ్యమే లేదు

అరుణోదయాదీప్తమగు నామె జలరాశి
పూర్వాంధ్ర వైభవస్ఫూర్తికే యంజనము
అహరంత పరిదీప్తమగు నామె జలరాశి
భావ్యాంధ్ర వైభవప్రగతికే దర్పణము

శ్రీమంతంబగు నాంధ్రీసీమంతినికిన్ ముక్తా
దామంబగు నన్నదికిం దరళంబై తగు నొక్క పు
రీంద్రము *నలసోమన భూమీంద్రుని రాజ్యేందిరకుం
జాంద్రీహర్మ్యము; సుకళాకేంద్రము; గద్వాలాఖ్యము

కందశిలాద్భుత ధృతితోన్
ముందట నొదివిన వనంబు *మురికొని నిర్మించెన్
బృందారకపురి చందము
సుందరముగ నప్పురంబు సోమనృపుం డెంతేన్

సురుచిరమగు నప్పురి గన
పిరిగొను నీర్ష్యన్ మనంబు పెడదారి బడన్
సరదారుడు సయ్యదు; భూ
వరుడు ప్పేడుకు, సమీక పర్యుత్సుకుడై

* సోమనాద్రికి "నలసోమభూపాలుడ" నామాంతరము

* మురికొని = ఖండించి

మాదీ సర్కారనియును
మాదీ సూబా యనియుమ మదమత్సరుడై
వే దార్కొనె మ్లేచ్ఛు డన
హ్యోదారస్థేము దెస్గు నుర్వీనాథుస్

అంధు తోక నంటి చనెకు నధిక ఖలులు
గంధయుతులు బౌఢ్రకౌర్య కలితమతులు
రాయచూరి బసరుజంగు నాయకుండు
ప్రాగటూరి యదరుసాబు పాలకుండు
వాని గూడవచ్చి రధిక బలము కలిమి.

ఉప్పెనవలె నిల గ్రమ్మిన
ఉప్పేడీశ్వర చమూత్కరోత్సాహంబున్
చప్పన ధూళిం గల్పిరి
అప్పురితెల్గులరిహరిణ హర్యక్షములై

ఉద్దామస్థేముడు సోమోర్వీశుడు భారత సం
పద్దస్యుల, దుర్ధిషణావశ్యుల, మ్లేచ్ఛుల నిజసం
యద్దర్పాగ్నికి వైళమె అర్పణసేయస్, "భాయీ
వద్దిక యుద్ధము, బ్రతికిన బాగ"ని పలుచిరి వారల్

వెన్నుజూపి సయ్యదుండు వేడె "నన్ను గావు మ"నుచు
పరుగుదీసె బసరుజంగు "బ్రతికియున్న చాలు న"నుచు
తోకముడిచె నిదరుసాబు "తోడు నాకు దేవు డ"నుచు
ఇంటి ముఖము పట్టె వారి వెంటనున్న సైన్య మెపుడొ

"ఆంధ్ర నృపచంద్రు శౌర్యంబు నలతి చేసి
క్షణములోపల నిర్జింతు మనుచు దలచి
భంగపడి పాఱితిమి యెట్లొ బ్రతుకు కొఱకు
కొఱవితోడను తలగోకికొంటి మకట!"

అని రోషారుణవదనుడు
ఘనలజ్జార్తుడు, పరిభవకాతరుడై, ఏ
యనువున శాంతిం గానక
వినీతు డా నయదు డాప్తవీరుల గనుచున్

ఎరియించెను బ్రాణము నీ
పరిభవ మని యఱచె, బండ్లు పటపట గొఱికెన్
పరిపరి విధముల దెసుగుం
ధరనాయకు గ్రిందు సేయు దారులు వెదకెన్

కానీ వారాతనివలె ఘనరోషాంధులు
గానందున బల్కిరి, "ఈ కాఱుల ఫలితము
గూడునె? యిప్పుడె కాదా కుడిచితిమాంధ్ర ధ
రాధిపు దఱటుల యూ మెత లజ్జులదాకన్

శాంతింపుము నయ్యదు; నీ
సొంతమె యీ ధర? తెనుంగు క్షోణీపతితో
వంతుగ నేలుము;" అని వా
రెంతో యత్నించి రతని కితముం దెలుపన్

కాని యానుడులతని కప్రియము లయ్యె
పైత్యదోషార్తునకు బంచదారయు బోలె
అతని మనమందు గుందట్టులే నిల్చె
నిర్వాతదేశమున నీలమేఘము వోలె.



ఇట్లు మ్లేచ్ఛుల నిర్జించి యింద్రసముడు
సోమభూజాని గద్వాల క్షోణిలోన
నింద్రపురి రీతి గావింప నిచ్ఛగించి
బహుళ నవసౌధ నిర్మాణ పరతుడయ్యె

నాటికె శత్రుగణాభేద్యంబగు
కోటకు మఱిన్ని *క్రొత్తళములు గూర్చెన్
ఘోటకశాలలు, కుంజరశాలలు
నీటుగ మఱిన్ని వీట న్నెలకొల్పెన్

---

*క్రొత్తళములు = బురుజులు

ప్రవిశాలంబగు బాటల కిరుగడ
పువుగుత్తుల తరువుల నాటించెను
నవకపు దోపల, నాట్యాలయముల
బ్రవిభూషించెను పట్టణమంతను

పశువుల శాలలు, వర్తకశాలలు
శిశువుల శాలలు, పిశితపు శాలలు
విశాల సుందర విద్యాశాలలు
ప్రశస్తముగ నగరంబున నిల్పెను

పదివేల నాలుకల వదరుబోతైన నా
గేంద్రతల్పమున శయనించు నెటులు ?
పదియార్వెయిల స్త్రీల బంధమ్ములం జిక్కి
ఆవంతయున్ శ్రాంతినందు నెటులు ?
ముక్కోటి దేవతల యిక్కట్టులం బాపు
తలనొప్పి నిచ్చలుం దాళు నెటులు ?
ఒకమాటకు న్నాల్గుమొకముల న్వాడించు
సుతునిపంచను జేరి బ్రతుకు నెటులు ?

అకట ! అనువైన యిల్లొకటైన లేక
శాంతి కొఱవడె కేశవస్వామి కనుచు
సకల సౌఖ్యదమగు దేవసద్మ మొకటి
నగరి నిర్మించి, కేశవునందు నిలిపె

ఉదయాది విప్రోక్త మృదుమధుర వైతాళి
కస్తోత్ర రసలహరికం దోగి లేచు
ఉదయమధ్యంబునం దొదవు కోవిద శాస్త్ర
చర్చ లాకర్ణించి సమ్మదము నొందు

మధ్యాహ్నపూజా సమర్పిత మధుర పాయ
సాపూప రుచిసౌష్ఠవాకృష్టు డగును
అపరాహ్ణకాల చపలాంగికాలాస్య వి
న్యాస మీక్షించి రోమాంచముం బొందు
ఆహరంత పూజార్పితామ్లాన మాలతీ
సౌరభ్యమున కెంతొ సంతసము నించు
యామినీసమయ పర్యంక సేవాప్రాప్త
తల్పమున సిరితోడుతం బవ్వళించు

మాఘపూర్ణిమ నాడు లక్ష్మమ్మ తోడ
తేరులో నెక్కి గద్వాల పౌరజనుల
కలిమిలేము లరయుచు గక్ష్యలను దిరుగు
కేశవుం డర్థిపాలన ఖేలనుండు

తావలంబగు నాంధ్రధాత్రీసురశ్రేష్ఠ
పావన శ్రుతి శాస్త్ర పాఠములకు
కాణాచియగు నాంధ్రగాయకకులశ్రేష్ఠ
కలకంఠమాధుర్య గరిమమునకు
రంగోర్వియగు నాంధ్రలాస్యాంగనారత్న
మంజీర సంగీత మంజులతకు
కల్పద్రువగు నాంధ్రశిల్పకారకకళా
ప్రవతతికా నిరత వాల్లభ్యమునకు

సకలాంధ్ర సంస్కృతికి సరిలేని ముకురంబు
సోమవిభు కీర్తికిన్ సొంపారు మకుటంబు
కేశవస్వామికిం గేళికారామంబు
అసమాన మీయుర్వి నాదివ్యవేశ్మంబు

మీనకేతుని మించు నానగరి పురుషాళి
సౌందర్య విభవమ్ము చందమ్ము నాలించి
తమకమ్ము దాళకన్ ధరమెట్టి యున్నట్టి
రంభాదు లేసుమ్ము రమణు లాపురమందు

ఆస్త్రీల దరహాస మాలేప మొనరించు
కలికివెన్నెల తోడ గారుచీకటినైన
ఆస్త్రీల రసలీల లావిద్ధమొనరించు
కామవిహతముగాని కలికంతు మతినైన

ఆయూరి నట్టువల అతిలోక వైదగ్ధ్య
మగు నాంధ్రభారతికి నపురూపరవణమ్ము
ఆయూరి గాయకుల అసమానగాంధర్వ
మగు నాంధ్రభారతికి నమృతనై వేద్యమ్ము

ఆయూరి బ్రాహ్మణుల అసమాన వైదుష్య
మగు నాంధ్రభారతికి నముల చందనవిలేపమ్ము
ఆయూరి శ్రోత్రియుల అనవద్య శ్రుతివిద్య
యగు నాంధ్రభారతికి దగు మంగళాశాసనమ్ము

రతనాల కుండలాల్ శ్రుతులందు వెలుగొంద
తిరునామముల్ నెన్నుదురులందు దెలివొంద
తులసిపేరులు గళమ్ములయందు నెలవొంద
చక్రాంకములు భుజాస్థలులందు నలువొంద
జినుగంచు దోవతుల్ తనులందు జెలువొంద
సంవ్యానకము లురఃస్థలులందు బొలుపొంద

పరమ భాగవతులు; సదా వాసుదేవ
చరణకంజాత భృంగిత స్వాంతు లనఘు
లపరభాష్యకారు లగుచు నప్పురమున
నయనముల దనియింత్రు వైష్ణవులు మిగుల

వారు పరమాత్మరూపులై పరగుచుండ
ఆపురం బొప్పు జీవాత్మరూప మగుచు
వార లాధేయవిధినంది పరిఢవిల్ల
ఆపురం బొప్పు నాధారరూప మగుచు

ఆవీటి భటసముదయావక్ర విక్రమము
తీరెఱిగి, తనశక్తి వారితో బోల్చికొని
తీవ్రమగు సిగ్గుచే దినరాజు వదనంబు
మబ్బుతెరచీరతో మఱిమఱిం గప్పికొను

ఇటు లాంధ్రసంస్కృతికి స్ఫటికంపు ముకురమై
శోభిల్లు నప్పురిన్ సోమభూపాలుండు
కొలువుండె దనుగొల్వ కోవిదులు, కవిచంద్రు,
లగధీరులగువీరు లతివిధేయత తోడ

పరమ భక్తుడతండు స్వయముగా గావించు
కేశవస్వామికిన్ గృహమార్జనాది విధులు
ప్రతి మాఘపూర్ణిమకు రథసేవ గావించి
యోధకవినటకబుధయూధముల గారవించు



జయజయ మహాంధ్ర సర్వం
సహా సముద్ధారణ దీ
క్షా కంకణాంకితపాణీ !

దుర్వార విద్విషద్గణ
గర్వ తమో నిర్వాపణ
పర్వోత్సుక దోర్ద్వితయా
ఖర్వ పరాక్రమ సూర్యా !

మందార కుంద చందన
బృందారక సుందరీ సు
మందస్మితచయ నిందద
మందామలకీర్తినిధీ !

ప్రతివత్సర శిశిరాగత
వరపండిత కావ్యవధూ
రసవత్ స్పర్శన రచితా
హ్లాద సుమాంచిత చూతా !

నానావిధ ముగ్ధకళా
నూనాంచిత దృబ్ధ మనో
జ్ఞాలంకరణోపాయన
సమర్పణానందిత వా
ణీ స్నిగ్ధస్మిత సేచన
నిచితోత్కటపులకాంగా !

క్షితితల వైకుంఠోపమ
శ్రీకేశవమందిర ని
ర్మితిసంచిత ఘనపుణ్యా !

శ్రీ ముష్టిపల్లివంశ క్షీరాబ్ధిశశాంకా
శ్రీమద్గద్వాలరమా శ్రీవత్సాంకా !
శ్రీ సోమాధిప ! శ్రీ సోమాధిప !
జయము ! జయము !
చిరదీనావన దీక్షాపర పద్మాధిప !

జయము ! జయము !
జయము ! జయము !

ఈగతిని దెసలందు మ్రోగెగ్ కైవారముల్
మగధాస్య నిష్యంది మధురామృతాసారముల్
నటదీశ ఢమరుకానాద గంభీరముల్
నటదప్సరశ్శ్రేష్ఠ నయగాన మాధుర్యముల్

అంతలో గననై రి హయరూఢు లతిచిత్ర
వర్ణంచితోష్ణీష పరిధానధారుల్
కళ్యముల గొని పంచకళ్యాణులం దీరు
గా దోలు నాశ్వికులు కౌశల్యసారుల్

వారి వెనుకను వాహినీశులు
సచివవర్యులు సప్తపర్వత
కటకసీమల గదలుమబ్బుల
చాలులట్టుల సాగిపోయిరి

వారి పిరుదను బారుదీరెను
వందిమాగధ వాద్యకోవిద
దేవదాసీ దివ్యలాసీ
పుణ్యసాధ్వీ పోష్యవర్గము

రమ్యచేలక రత్నభూషణ
రాజితంబగు రాజవారణ
మంత నొక్కటి అక్షిగోచర
మయ్యె గదలెడు నద్రి పోలిక

ఏక ఘీంకృతి తోడ నాక కరినే గెల్చు
భద్రేభపీఠిపై బలవైరినే గెల్చు
రూపాన నలసోమభూపాలుడే పొల్చు
పార్శ్వమున దద్రాజ్ఞి పౌలోమినే గెల్చు

ప్రభుని వెనుకను స్వర్ణభూషిత
వారణంబుల వరుసదీరిరి
మండితాంగులు మండలేశులు
పోష్యజనములు పూని కొలువగ

వెనుక సాగిరి విప్రవర్యులు
వివిధగాయక కవివరేణ్యులు
శిల్పకారక చిత్రకారక
కనకకారక కళాధుర్యులు

వారి వెంటను పౌరజనములు
కదలితరగల వడువు నడరుచు
కదలసాగిరి క్రమభూషణ
వసన మాలోల్లసిత గాత్రులు

మంజుతరమౌ మనుజరూపము
గాంచి కదలెడు మంచుకణముల
బోలు వారల మేళనంబున
అష్టమాంబుధి సృష్టియయ్యెను

"జయ జయ కేశవ! జయమామందిర!
జయ మునిమానస జలజేందిందిర!
జయ కంధరకృష్ణ వపుస్సుందర!
జయ లోకక్షయసర్గ ధురంధర!

జయ జయ కేశవ! జయ చక్రధరా!
జయ జయ కేశవ! జయశంఖధరా!
జయ జయ కేశవ! జయ శార్ఙ్గధరా!
జయ జయ కేశవ! జయ పద్మధరా!"

అను వారల ప్రాజ్య స్తుతిపాఠము
లా యంభోనిధి కపూర్వ నాదము లయ్యేన్
అను వారల భక్త్యావేశము లా
సాగరసంగత ఝుంఝూసారము లయ్యేన్

అది మాఘపూర్ణిమా స్వాతిశుభవేళ యని
ఆనాడు కేశవున కరదంపుసేవ యని
తద్భక్తి రసభంగి తాధ్వములై వ్యంజించె
తద్గీతికా ప్రతిధ్వానములై వచియించె

ప్రతి గృహ మొక గోపల్లికయై
ప్రతి గృహిణియు నొక వల్లవియై
ప్రతి వాక్యం బొక పల్లవియై
రమ్మనె హరినా రమ్యాహంబున

ఈ విధి నూరేగెడు వసు
ధావిభు పరివారముపయి దలిరులవానన్
శ్రీవహముగ గురిపించిరి
అ వీటి కుటుంబినులమితామోదమునన్

పాలకడలిందేలు సోముని
మాడ్కి జనతామధ్యమందున
గ్రాలు సోముని గాంచి పౌరులు
సమ్మదాశ్రుల జడుల రాల్చిరి

సాగి సాగి ఇటుల కడకు
నాగిపోయె జనగణమ్ము
సాగి సాగి తటము నొరసి
ఆగిపోవు నల విధమ్ము

అచట బొల్చె కేశవాలయమ్ము
అచల యందు స్వర్గ మదియె సుమ్ము
హస్తిడిగ్గి సోము డచట నిల్చె
పరిజనమ్ము లతని పిరుద బొల్చె

ఊర్ధ్వపుండ్ర సముజ్జ్వలాంగులు
పవిత్రాంకిత పాణిపద్మలు
వేదవిప్రులు మేదినీశుని
పూర్ణకుంభము బూని తార్కొని
స్వాగతమ్మును బల్కి రంతట

బ్రాహ్మణావళి స్వస్తివాక్కులు
వాద్యఘోషలు, భద్రగీతులు
పరగ సోముడు పరిజనులతో
మందిరాంతరమందు జొచ్చెను

ఈ విధిని శ్రీవిభుని కోవెలం జొచ్చి
దైవజ్ఞ నిర్ణీత తతశుభ క్షణమందు
క్ష్మావిభుం డర్చనా సంరంభు డయ్యె
దేవేరి యతని తారావిధి ననుసరించె

పరమేష్ఠి సన్నిభ ద్విజ
పరమాగమ మంత్రపాఠ పంక్తులు, వీణా
మురళీ మృదంగ నానా
వరవాద్యజ భద్రరుతులు బరగుచు నుండన్

అమలిన కృష్ణాజలముల
కమలావతి కంత నృపతి కరతోయంబొసగెన్
సుమగంధిల తజ్జలముల
సుమసాయకపితరు నంత సుస్నాతు నొనర్చెన్

కుసుమాంగీ నీతాద్భుత
కుసుమమ్ముల శ్రీపతిపయి గురిపించెన్, ధౌ
తసుచేలస్రగ్భూషా
విసరము లర్పించె విభుడు విశ్వాత్మునకున్

వరకుంకుమ కస్తూరీ
హరిచందన లేప మలదె నబ్జాక్షునకున్
ధరణీధవు డావై సురు
చిరమగు నైవేద్యమొసగె శ్రీవక్షునకున్

మంగళతూర్యము సెలగగ
నంగజ గురునకు గపురపుటారతి నొసగెన్
పొంగారెడు భక్తిన్ సా
ష్టాంగనతి యొనర్చె హరికి నవనిపు డుపరిన్

ఈరీతి కేశవుని ఆరాధితుం జేసి
భూరి దక్షిణలతో భూసురుల గైసేసి
అర్ధాంగి యుతుడౌచు నవనీశచంద్రుండు
ప్రాంగణస్థితమైన బ్రహ్మరథముం జేరి

కదళీచ్ఛదముల, సహకా
రదళాంచిత తోరణముల, రమణీయ సప
ద్యుదిత ప్రసవస్రజముల
హృదయంగమమౌ శతాంగహృదయము నందున్

ఉపవిష్టులై యున్న ఉత్సవుల నర్చించి
పరిజనులతో గూడి పగ్గముల సడలించి
స్వయముగా సోముండు స్యందనము గదలించె
ప్రజలెల్ల బారులై పగ్గముల గొనిరంత



నాడు మొదలుగ నాల్గు నాడులు
కొలువు దీర్చును కువలయేశుడు
నేల నిల్చిన నిర్జరేశుని
ఓలగంబును బోలు దానిని

నాడు మొదలుగ నాల్గు నాడులు
నగరి యందున నాట్యనాటక
సారకవితా క్షత్రవిద్యా
చతురిమంబే సల్పు రాజ్యము

నాడు మొదలుగ నాల్గు నాడులు
దేవదాసీ దివ్యగీతా
లాపసంయుత లాస్యరీతులె
దేవళమ్ముల దేజరిల్లును

అవనిలోపల పుణ్య మార్జించుకొన్నట్టి
అనఘులెవ్వరొ కందు రట్టి విభవంబు దివాన
కాని యానాగరుల ఘన భాగ్య మెట్టిదో
తాముగా బోషింత్రు తద్వైభవం బవని లోన

ఒక మహేంద్రము నుండి ఉత్సృష్టమై మరుత్
స్పర్శకుం దూగాడు ప్రసవణ విధమౌచు
ఒక మహీజముచుట్టు నూర్మికోపమమౌచు
వలమానమగు చైత్రవల్లరీ విధమౌచు
ఒక మదవతీ నూపురోదితస్వనభీత
మై గాలిలో దేలు హరిణమ్ము విధమౌచు
ఒక కాంత కరతాళ సుకుమార లయకలరి
నటియించు మదబర్హిణగణమ్ము విధమౌచు

అంగవిక్షేప నానారసానుకూల
రమ్యముద్రాభినయభావ రమ్యమైన
గతుల నర్తించు నొక్కొక్క గడిత యపుడు
నాట్య బహుమాన సముపార్జ నాభిలాష

కలకదేఱిన శరత్కాలమ్ము తటినిపై
ఎలగాలికిన్ లేచు లలితోర్మికల వోలె
కలికి పున్నమిరేల గలువకన్నెలమోము
లలనల్ల ముద్దాడు తెలివెన్నెలల వోలె
తొలిరేయి ప్రియురాలి తలవెండ్రుకల డాగి
చిలిపినవ్వుల జిల్కు తెలిమల్లియల వోలె
కలికి మోవులతావి గలిసి యిమ్మడియైన
మలయాగ సంజనిత మధురానిలము వోలె

మధురమై, మృదులమై, మహిత బ్రహ్మానంద
సంధాయకంబై, అసమబాణ సమ్మోహ
నాస్త్రమై చూపఱుల నవశులం గావించు
ఆ స్త్రీల రసబంధురాభినయ పాండిమము

ఉర్విన్వారుండగ నిక
నూర్వశికై వ్రజ్యయేల ? ఉండ నమృతపుం
జెర్వొక్కటి కడ, నేలా
పర్విడుట దవిష్ఠ విషధి పాథస్సునకై ?

పూత త్రిపుండ్రోర్ధ్వపుండ్ర మండిత ఫాల
ముల బ్రహ్మతేజమ్ము గలుగు వారు
సువిశాల కర్ణాంత శోభాయమాన వై
డూర్య కుండలవిభం దోగు వారు

కంబునిభ కంధరాలంబమాన స్ఫటిక
రుద్రాక్షమాలికా రుచుల వారు
సువిశాల గాఢ వక్షోపలక్షిత పూత
యజ్ఞోపవీతాభ నలరు వారు
తదురఃపినద్ధ మృదు ధవళోత్తరీయ ప్ర
భా దిగ్ధ కకుభులై పరగు వారు
పాణితల విన్యస్త బహుళాత్మకృతగ్రంథ
శతపత్త్రిలై యింపుసలుపు వారు

ఆంధ్రగీర్వాణవాగ్దేవతానవరత
మందిరీకృతా కలుషితమంజువాక్కు-
లవనిదేవు లావేళ సోమవిభు సభకు
మారుమూలల నుండి యింపార జేరి

సరసావధాన, రసవ
త్తరాశుకవితావిధముల. దర్కచ్ఛందో
నిరుక్త సాహిత్య వ్యా
కరణాలంకారశాస్త్ర ఘనవాదములన్

తనరెడు ప్రాగల్భ్యప్రహ
రణముల బండితగోష్ఠిరణముల ప్రతివిద్వ
ద్గణముల గెలుతురు; గెలుతురు
ఘనదక్షిణలను దానన్ గద్వాలాసభలోన్

పసిడిలో రతనాలు పొసగించినటు పదం
బుల నూతనార్థముల్ పొందుపఱచి
గందవొడికి న్విరులగందంబు గూర్చినటు
వాక్యముల వైచిత్రి బాదుకొల్పి

నీరమ్ము, క్షీరమ్ము నేర్పరచు హంసలటు
కావ్యగుణదోషముల క్రమము లెఱిగి
వరవర్ణినికి నవ్యతరభూషలను గూర్చి
నటు లలంకారమ్ము లమరజేసి

విరులతో మాలకరి వివిధమౌ హారముల
విరచించుగతి సుధావిమలమధురోక్తులను
విరచింతు రాశువుగ వరకావ్యముల వారు
కురిపింత్రు నవపద్యకుసుమమ్ములను వారు

వారల వాక్చాతుర్యము
వారల సాహిత్యశాస్త్రవైదుష్యంబున్
వారల సద్యఃస్ఫూర్తియు
వారల కవితావిశేషవైదుదగ్ధ్యంబున్

కని విస్మితులై వినుతిం
పనివారును, బులకల దనువల్లికలం బూ
ననివారును, కనరారెం
దును తచ్చైఛిరవిద్వత్సద్గోల యందున్

అపు డాంధ్రదేశంపు టన్నిమూలల నుండి
వీరభద్రుని బోలు వీరవరు లేతెంచి
సప్తిచాలన కళా చాతుర్యముం జూపి
ప్రభువు మన్నన లంది పరితుష్టు లయ్యెదరు

అట్టి వారల యందు గొందఱు
సంగరకళా సవ్యసాచుల
కవనినాయకు డాత్మసైన్యము
నందు గొలువిడి యాదరించును

అట్లు వచ్చిన వీరవర్యౌఘ మందు
ప్రాప్తయౌవనప్రద్యుమ్న రమ్యమూర్తి
స్థేమనిర్జితమార్తాండ తీక్ష్ణమూర్తి
అక్షితర్పణ మొనరించె నపుడొకండు

ఉన్నతాంగమ్ముపై నూర్జితమ్మగు శిర
మ్మున సితోష్ణీషమ్ము మురువు సూప
ముఖసుధాకరబింబమునకు జిహ్నములైన
శ్మశ్రువుల సౌందర్య మతిశయింప
దుర్గార రోపమస్థూలవక్షముపైన
హరితకూర్పాసంబు హరువు సూప
దట్టించి బిగగట్టినట్టి దోవతి బల్లి
పొరయట్టు లంగముం బొదవికొనగ

అంఘ్రు లందున బాపోసు లందగింప
కరము లందున గళ్ళెంబు కదలియాడ
అభ్ర ఘోటక సంకాశమైన శ్వేత
వీతిరూఢుడై యతడు సంప్రేక్ష్యుడయ్యె

పక్కితేజిని వీడి ఎక్కివచ్చెనొ శార్జ్గి
అక్కజమ్ముగ శ్వేతహయము ననగ
నింగి వెల్గుట మాని నేలకుం డిగివచ్చె
నో హయారూఢుడై ద్యుమణి యనగ
తొలిభవంబున నశ్వములపయిం గలప్రీతి
దిరిగి పుట్టిన సహదేవు డనగ
అల్పాయువగుటచే నాదిజన్మము నందు
మఱల బుట్టిన యభిమన్యు డనగ

ప్రన్ననే జూలు నలనల్ల బాణి నిమిరి
గళము దట్టుచు జిత్రంపుగతుల దేల్చి
కళ్ళెముం ద్రిప్పి లక్ష్యంబు కడకు జేర్చి
స్వారి గావించె నవలీల సప్తి నతడు

తననన్నలన్మెలగు ధవళాశ్వరాజమున్
వెనుకకుం బ్రక్కకు న్వెసముందుకుం ద్రోలి
కందుకము నొకదాని గగనమందగ వైచి
అందముగ నద్దాని నఱచేత మీటుచున్

కందుకము నొకదాని ముందునకు బడవైచి
అందుకొనదాని హయ మతిరయమ్మున ద్రోలి
ప్రక్కకున్ ముందుకుం బాణిచే గొట్టుచున్
అక్కజమ్ముగ వలయమ్ము లేర్పరచుచున్

అలవోక జరియించె నయ్యాశ్వికుండు
భళిభళీ యని ప్రజలు బహుప్రస్తుతింప

ఆపైన నశ్వంబు నత్యంత జవనాప్తి
జక్రవాతము లీల జంక్రమింపగజేసె;
తద్గళస్థితమణిస్ధగిత భూషణపాళి
కొఱవి ద్రిప్పినరీతి గొమరార మెఱయంగ

అంతియేకాక నాయౌపవాహ్యంబు
వల్గితప్లుతముఖ్యవల్గుగతులార
వల్గనం బొనరించె వల్గానుషక్త
వల్గుకరచాలన ప్రావీణ్యయుక్తి

అనిలజవనాప్తి బర్వు నాయర్వరాజ
చంచల ఖురాంచ లోత్థిత సాంద్రధూళి
ప్రాంత్య కృష్ణవేణీ స్తనపద్మకోర
కమ్ములం బొల్చె గంధపంకమ్ము లీల

ఆవీరచంద్రమ ప్రావీణ్య చంద్రికా
సాంద్రమగు నవ్వేళ జనవార్థి యుప్పొంగె
ఉద్వేలతర సమ్మదోర్మికా సంసక్తి
జయజయారవ రణజ్జగతీత్రయం బగుచు

కందుము కౌశలమందిరులన్ ము
న్నెందటినో యాశ్వికకుల హిమమందిరులన్
కందుమె వారల యందీ చంద మ
మందాద్భుతమగు నైపుణి మందున కైనన్

అని సామాజికు లెల్లన్
ఘనవిస్మయ మగ్నాంతఃకరణాంబుజులై
కొనియాడిరి యాతని వి
న్ననువుం గరతాళానూనధ్వను లెసగన్

అపుడాతని గని సోమధ
రాపతి వచించె నీగతి

లోకాతీతంబై తగు నీకౌశలవృత్తిన్
మాకుం జేకూర్చితి వస్తోకంబగు తృప్తిన్
రాకాచంద్రమునిం గని నాకంబంటిన దు
గ్ధాకూపారంబయి మాయాకూతం బలరెన్

పాలుగాతెడు నీదు పాలచంద్రుని జూడ
ప్రాయ మిఱువదియేని బాటిల్ల దనిపించు
ఈలోన జేకూరె నేరీతి నీకింత
చతురతాలాఘవప్రతిభా విశేషమ్ము ?

నిను బోలిన ఘనవిక్రమ
వనజాప్తుల కతమునగద పాయును మనయాంధ్రా
వని బర్వినయైస్లామిక
జనాధికారాంధకారచయ మామూలముగన్

ఓవీరాన్వయరత్నమ !
నీవిక్రమతరణి కిపుడు నీరాజన మీ
గా వలతురు క్షత్త్రి కళా
కోవిదు లస్మత్పరీక్షకోత్తము లెలమిన్

వారల సంశ్రవ కారణమున నో
వీరాగ్రణి ! కొనుమవిరతవిజయశ్రీదము;
స్ఫారవిభాశంపానిభమగు నీ
వీరకృపాణము మా యుపహారముగాగన్

సురుచిరమగు నీకర పం
కరుహంబునకుం బరగుత కళ్యాణకరా
భరణంబై యీఖడ్గము
నరకేసరి కరమున కల నందకమట్టులన్

వెండియు నో రణవిద్యాఖండల
ఉండుము మాకొలువున నూర్జితముగ నింకన్
మండనమగుచున్ మా బలములకున్
భండన భూముల జెండాడుము శాత్రవులన్"

అనిపల్కి సోమవసుధామరేంద్రుండు
నవరత్నఖచితమౌ పవివంటి ఖడ్గమ్ము
నర్పించె నతని కత్యాదరముతోడ
చదలంటె నప్పుడే జనతా ప్రహర్షమ్ము

అట్లు క్షితినాథదత్తశాతాసి బూని
చంచలాన్వితమైన వర్షాభ్రమట్లు
తేజరిల్లెడు నతనికిం దృప్తి నిడెను
వీరహారతి నంత సాధ్వీగణంబు

అతని వైభవ మద్భుతంబై
దృగ్జన్మనంబుల దృప్తి నినుచగ
వందిమాగధ బృందమంతట
బలికె నిట్టుల లలితభాషల

"స్ఫారశౌర్యావధీరిత హరి
మండలా ! హనుమప్పనాయా !
జయము గల్గుత ! జయము గల్గుత !
క్రమబొచ్చెంగన్నపల్లీ
మండనా ! హనుమప్పనాయా !
జయము గల్గుత ! జయము గల్గుత !"

అనువారి పల్కులే యాతండు
హనుమప్పయని చెప్ప వేఱుగా
వ్యంజింప బనియేమి నాకు ?
వ్యంజనకు దావేది వాచ్యమే
ప్రచురమై రాజ్యమేలెడు చోట !



గద్వాలనాథకృత ఘనగౌరవంబు
ప్రావృడంబుద దత్తవర్షంబు వోలె
నిండింప నిజమనో నీరజాకరము
నుద్వేల సమ్మద రసోల్బణత చేత

నలసోమ భూపాలు బలములందున జేరి
సేవించు భాగ్యంబు సిద్ధించె నెపుడపుడె
తనజీవితాశయంబను ద్వీపముంజేర
దిక్సూచి యొకటి చేతికి జిక్కినటు దోచ

ఆంధ్రావనీరమాత్యంతసౌభాగ్య
సంతతారక్షణాసక్తమై యున్న
నిజజీవితాశయము నెఱవేఱు నింక
నని తృప్తిపడె నెంతొ హనుమప్ప యంత

రాజేంద్ర సన్మానరాజితుండైన
పుత్త్రిగని అభిమోదపుష్పాభివిలసి
తోత్కృష్ట హృద్వల్లికోత్కర్ష కలితు
లైరి యాతనిపితరు లవ్వేళయందు



అతడాంధ్ర భూపాల కానీకమున జేరి
గడువలే దొకకొన్ని ఘస్రంబు లట్లయ్యు
గావించె తనకీర్తి కాంతిపుంజము చేత
గద్వాలక్ష్మికిం గ్రమనీరాజనము

అనుదినావర్ధమానమౌ యతనికీర్తి
కాంతి నిండారు జగమందు సంతత క్ష
యామయగ్రస్తుడై యపుడప్డు మాత్ర
మే మెఱయు నెలతో బనేమి యనిపించు

గద్వాలసామ్రాజ్య కంధిజాసౌవర్ణ
కరకంకణోదిత క్వణనోపమం బౌచు
ఖణఖణ ధ్వనులెసగ ఖడ్గయుద్ధాభ్యాస
మునదేలు నాతండు రణకోవిదుల గూడి

ఆ లీఢపాదుడై యాతండు వింటి నా
కర్ణాంతముగలాగి గాఢజవసత్వకలి
తమ్ములౌ యమ్ములం దద్దయుం గుఱిపించు
ధనురాహవాభ్యాసమున దేలు తఱులందు

మున్నుగా నొకలక్ష్యముపలక్షణము సేసి
వెనుదిరిగె యద్దాని ననువెఱిగి ఛేదించి,
ముకురాన నీక్షించి యొకలక్ష్యపుంబింబ
మకలంక కౌశలత నద్దాని ఛేదించి,
కనరాక గూఢమై నినదించు లక్ష్యమ్ము
నినదానుసారియై యనువొప్ప ఛేదించి,
వాతమ్ము గతి నెఱిగి ప్రచలించు లక్ష్యమ్ము
స్థితి నెఱిగి, యద్దాని జతురతం ఛేదించి

బహుభంగులం ధనుష్పాండిత్యముం జూపు
హనుమప్ప నిజముగా నర్జునుడె యనిపించు

మందురాతతి యాజమాన్యంబునం గొన్నాళ్ళు
హస్తికాలయ నిర్వహణమందునం గొన్నాళ్ళు
రాజహయముఖ్య సంరక్షమునం గొన్నాళ్ళు
రాజగజముఖ్య పరిరక్షణమునం గొన్నాళ్ళు

మెచ్చించి హనుమప్ప వివిధరంగమ్ములం
దెనలేని యనుభవంబును గడనయొనరించె

వారిపూర్ణంబు యుక్తాతపాన్వితంబు
సారమేదురంబైన కేదారమందు
శశ్వదభివృద్ధి నొందు రాజనము వోలె
బహుముఖాన్విత వైదగ్ధ్యపాటవంబు
లనెడు గంటుల నేపారి యతిశయించె
అతని విక్రమాంకూరంబు ప్రతిదినంబు
సోమభూపాల కాస్థానసీమ యందు

మలిన మత్త్రికాభవమైన మణిలలామ
మమల భర్మానుషక్తిచే నతుల మాన్య
మైన పగిది సోమనృప సేవానుషక్తి
కలన హనుమప్ప యతిమాన్య కలితుడయ్యె



# చతుర్థాశ్వాసము

ఒక కుత్సితుని దుర్మనోంతర స్థితమైన
స్వార్థకుధానల ప్రతిబింబమో నాగ
కననయ్యె నవ్వేళ గాఢకాషాయ ప్ర
భా భాసురంబైన పశ్చిమాశాముఖము

ఒక్క దుశ్శీలు వ్యూహంపు టురుల యందు
జిక్కకొని నట్టి నచ్ఛిలు చక్క దోప
సాంద్ర భూరుహచ్ఛదసంధి సరణు లందు
అక్షిగోచరు డయ్యె లోకాప్తుడపుడు

హేతు వింతలేకయె పరభూతలేంద్ర
మండలము లాక్రమించగ మత్సరించు
నృపతి యూహల చాలుల నిభము లగుచు
నీడలంతట నిడుదలై నేల బొల్చె

ఒక ధూర్తవర్తను మనోవిహాయసమందు
ఉచ్ఛృంఖలములైన న్యూనభావన లట్లు
దిరుగాడె గగనాన గరటాళి యవ్వేళ
కఠిన కాకారుతుల గలగించుచుం దెసల

భువనైక హితుడౌచు, పూర్ణతేజుండౌచు
వెలుగొందు నినుడింక విధివై పరీత్యాన
క్షతినందు ననిదెల్పు కార్తాంతికుల బోలి
నింగిలో దిరుగాడె నీడోద్భవకులమ్ము

అంతలో వీచె మలయాగమ శ్రీఖండ
తరుకాండ పరివేష్టదాభీల కుండలీ
సాంద్ర కాకోల నిశ్వాసాగ్ని పాణింధ
మంబౌ అవాచీన మారుత ప్రకరమ్ము

అట్టి వేళ సౌధకుట్టిమాంతరాన
ఆప్తసచివు డొకరు డండనుండి కొల్వ
అధిక రోషభీషణారుణాస్య నేత్ర
యుగళు డగుచు జింతనుండె నయ్యెదుండు

ఎఱతామరల గేరు నీక్షణంబుల నుండి
విస్ఫులింగంబులే వెలికి రాల
క్రౌర్యాగ్ని తప్తమౌ కాయయష్టిక యందు
ఘర్మాంబుపూరంబు కాల్వగట్ట
నిటల వీధీనటత్కుటిల భ్రుకుటివల్లి
కలు కాలఫణులట్లు గదలియాడ
గాఢదంతాగ్ర సంఘట్టనోదితమైన
పటపటాధ్వనులు దిక్తటుల నిండ

మొదట సోమభూపాలుతో నొదవియున్న
ఆహవమ్మున సంప్రాప్తమైన యట్టి
ఘన పరీభావ పావకగ్రస్తమైన
హృచ్ఛరీరుడై సయ్యదు మ్లేచ్ఛవిభుడు

హుక్కా త్రాగుచు; బొగచే
నక్కజముగ నుంగరముల నమరించుచు, గై
పెక్కగ మదిరం గ్రోలుచు;
ముక్కున్విఱచుచు నమాత్యముఖ్యుని గనుచున్

అనియెను, "భాయీ! తెనుగుం
జనపతి బూదిం గలుపక
క్షణమాత్రంబును నాకుం
గునుకొదవదు; కానీ యది
యొనగూడెడి యనువొకటియు
మనసున కందకయుండెన్"

నిన్న మొన్నటి దాక నెఱుగ మాతడెవండొ
కాని వాడే నేడు కంటిలో నలుసయ్యె
కొదమ సింగము నేడు కోతికే లోనయ్యె
కలవారిలో నాకు తలవంపులే యయ్యె

అరెరే! అవ్వల్ దర్జా
సరదారుడనయి, దురమున శత్రుంతపునై
పరగిన నన్నే గవ్వకు
గొఱగానీడయ్యె వాని క్రొవ్వెంతటిదో?

నన్నేమిటి ? నా యనుగుల నపూర్వబల సం
పన్నుల నిదరుం బసరుం బ్రాణమ్ములకై
వెన్నిడి పాఱంగొట్టెను ; ఉన్నదె మనుగడ
ఉన్నతుడై వాడుండగ నుర్వీన్మనకున్

దురమున బలవర్తనచే
బరివర్జ్యుడుగాక యున్న బలవద్రిపుకున్
పఱుపున జేరిన దర్వీ
కరమునకున్ భేదమింత గలదా చెపుమా ?

కావున వానిన్నాశము
గావింపగ నిచ్చలు మది గౌతుకమెంతున్
భావింపగ నది కూడెడు
నేవిధి నూత్నాలఘు బలహేతులు లేకన్ ?

ఒనగూడునె బలమూరక ?
మునుపటి జంగున ఖజాన మొహరీ లేకన్
మునుకొని ఖర్చుంజేసితి
నెనినాళ్లకొ యంత పైస యేర్పడు నింకన్ ?

కాని డబ్బులేదటంచు గాలయాపనంబు సేయ
గచ్చులోని కంకరట్లు గట్టిపడును వాడు మిగుల
కాన వాని జుట్టునిపుడె కరము నందు బట్ట వలెను
మూడు జగము లందు వాని ముష్టియెత్త బంపవలెను"

అనవుడు సచివుం డిట్లను
"జనవర ! మీకిట్లు బహువిచారంబేలా :
మనమెఱుగమె ఆ సోముని
ఘనతరమగు మేకపోతు గాంభీర్యంబున్ ?

మున్నొదవిన విజయముచే
నన్నెదురించెడు నరుడిక "నహినహి"యని తా
నున్నాడట ! కన్నుల గన
కున్నాడట మిథ్యాధైర్యోన్నతి కలనన్

ప్రథనార్థంబౌ శస్త్రాభ్యాసము పొంతం బోవక
కాంతాసంగము లందు గవిజనసంఘము లందున్
పాషాణార్చల యందుం బండితచర్చల యందున్
పుచ్చుచునున్నాడని వినవచ్చెనుగాదా కాలము !

తొలిపౌరుష మెంచుచు మీసల మెలివెట్టిన
దలకుటకై మనమంత యథాజాతులమా ?
అల కోతుల కిచకిచలకు దలకున దంతా
వళ కుంభస్థల రక్తపిపాసితమౌ హరి ?

కావున చింతస్వీడుము
భూవర ! దుర్దాంత నూత్న భుజదర్ప మహా
పావక శిఖలన్ సోమ
క్ష్మావిభు విభవంబు బూదిసలుపుము ప్రుదిటిలోన్

పరులగు సరదారులకుం
బరమార్థంబౌగద ! క్షణమాత్రంబున నూ
ర్వ్వరు తెలుగుల శీర్షమ్ముల
దఱుగుట ; ఈ సత్క్రియకిక దగులుము కడకన్

అత్యంత పావనంబగు నీమహోద్యమము
దుదిదాక నెఱవేర్ప దోడుగా వచ్చెదరు
మనమిత్రు లెందఱో మర్యాదతో నడిగి
నంతమాత్రాన చతురంగములతో గూడి

దృక్సంజ్ఞ మాత్రమున ద్విట్సంఘముల ధైర్య
ముండుల్చు నల నిజాముర్వరావిభుడు
శతమత్త గజములన్ క్షణములో బరిమార్ప
గల లావుగలవాడు కర్నూలు విభుడు
ఆలమ్ములో వైరిజాలమ్ములనుమక్షి
కాభమ్ముగా జదుపు నాదోనివిభుడు
పరనాథ యూథముల శిరములే బంతులుగ
నెత్తియాడెడువాడు గుత్తిపురవిభుడు
రాచవారలలోన రమణకెక్కినవాడు
ప్రస్ఫీతశౌర్యుండు రాయచూర్విభుడు
కదనరంగమ్ములం దెదురెఱుంగనివాడు
పంచాస్యతేజుండు ప్రాగటూర్విభుడు

వీరలాప్తులు ; మనకెల్ల వేళలందు
తోడురాగల వారింక దొ్రటుసడక
వారివేడుము ; కయ్యంవువహ్ని కింధ
నమ్ము గావింపు మాసోమనాద్రివిభుని

గండు మీటెడు మీ యఖండసైన్యము గాంచి
గండుపిల్లిని గాంచి కలుగులోపల దూఱు
చుండెలుక చందాన సోమభూపాలుండు
కండకావర ముడిగి కాళ్ళపైబడిపోవు !"

అను సచివునుద్బోధ అమృతోపమంబౌచు
శ్రుతిపర్వ మొనరింప, ప్రతినవాభీల శౌ
ర్యాంకురము లాక్షణమె ఆత్మలో నిండార
ఆరూఢధైర్యుడై యనె నయ్యదుం డిట్లు

"నీవంటి సచివుడొదవిన
క్ష్మావిభునకు గూడు గాఢ సంతత విజయ
శ్రీ వాల్లభ్యము ; మిత్రమ !
నీవలనం దీవెనయ్య నెవ్వగ నాకున్

వాచాతీతము నీ మనీష ; వంద్యంబు నీ జ్ఞానమున్
నీచే నాయెద నింతదాక నిద్రాణమైయున్న శౌ
ర్యాచారంబు ప్రబోధమొందె, ఆస్కంధనోత్సాహపున్
వైచిత్రిం దగు నాదుమేన బాటిల్లె రోమాంచముల్

కోశాగారము గుల్లవాఱినను, ఘోరాపదల్గూడినన్
రాశీభూతములౌచు యోద్ధల పురంబుల్దరం గూలినిన్
దేశంబెల్లను రక్తవాహినుల దేలించి యుద్ధంబునన్
నాశంబేనొనరింతు సోమనను నవ్యోరుదర్పంబునన్

కాలవ్యాళము కరణిన్నాకర
వాలము సోమనవాహిని నంపును
కాలుని వీటికి ; గబ్బిలములె యిక
పాలించును గద్వాలావీటిని

దారుణమగు నీమారణ హోమంబున్
పారము ముట్టింపగ హుతవాహునికిం
గాడుపు వోలెం దోడుగ రమ్మనుచున్
వేడెద నిజాము పృథ్వీవరు నింకన్

ప్రవిశాల దక్షిణాపథభూమి నెవ్వాడు
ఏకాతపత్త్రముగ నేలుచుండు
సకలమండలనాథ మకుటకాంతుల తోడ
నెవ్వాని ఆస్థాన మింపుమీరు
శతలక్ష హర్యక్ష సములైన భటులతో
నెవ్వాని పరివార మేపుమీరు
అవిధేయ సామంత పవియౌచు నెవ్వాడు
క్షణములో రాజ్యమ్ము జక్కజేయు

అతడు హైదరాబాదు రాజ్యాధిపుండు
పావనాసఫ్జహీవంశవార్ధి విధుడు
అఖిలశాత్రవ వదన ముద్రావతార
చండశాసనుండు నిజాముచక్రవర్తి

పెట్టని కోటగ నిజాము పృథ్వీశుండే నా
పట్టున గలడను వార్తయె పవియై తనచెవికిం
బట్టిన క్షణమందే గద్వాలేశుడు గుండెల్
ఫట్టున బగులం జచ్చును : భండన మింకేలా ?

అని రోషాటోపప్రకట భ్రుకుటీ నాట్యాంచిత ఫాలుండై
ఘనరక్తాతప శోభిత లోచనజిత రక్తాంభోజాతుండై
వినివర్తిత సంఘూర్ణిత వదనుండై తోడనె శిబికావహులం
బనిచెన్ వేకువ బల్లకి దేగన్ హైద్రాబాదునకుం జనగన్

ఉన్మనుండై యున్న ఉప్పేడుభూజాని
మనమందు నెలకొన్న మాలిన్యముంబోలె
వ్యాపించె కజ్జలం బారబోసినయట్లు
పూర్ణమై తమమంత భూనభమ్ముల యందు

మాటిమాటికి వాని మనమందు మెఱయు
ఆంధ్రావనీనాథ హరణేచ్ఛ వోలె
నడిమింట జెలువారు నక్షత్రరాశి
మిన్కుమిన్కు గ్రొత్త మెఱుగులం జిల్కె



వక్రోహావశుడై నిజాము
చక్రేశుం జూడగబోయెన్
నయ్యదుడని చారులవలనం
జయ్యన దెలిసెన్ సోమనకున్

అతుల స్థైర్యాకృతియై మతినా
వార్తార్థ నిరూపణ మొనరించి, ఆ
ప్తామాత్యుల, సేనాధీశుల, రా
బనిచి నిగూఢ సభాస్థలమునకున్

మెలమెల్ల గొనగోట మీసాల మెలివెట్టుచున్
కళవళము కలవైన గంభీర కంఠమ్మునన్
నలసోమనాద్రీశు డలఘు ధైర్యాద్రీశుడై
పలికె నిట్టుల సచివవాహినీశుల గాంచుచున్

తీరని పగబూనిన కా
లోరగముంబలె నవిరళ యుద్ధోత్సుకతా
దారదవశుడై నయ్యదు
కోరగ నేగెను నిజాము కులపతితోడున్

అని తెలియంగవచ్చెంగద !
వినతాసూనోపమ ఘన విక్రములారా !
కనుగొనవలె నాతని కా
టునకుం దగు విఱుగుడు నిపుణూర్జిత ఫణితిన్

తత సైన్యావష్టంభము కతనన్ రిపులకు సం
తత సింహస్వప్నంబై తగు నైజాము ధరా
పతి యిత్తఱి దోడగుటం బ్రథనంబున నాతం
డతి దుర్జేయుండగు ; నాకతమున మనమింకన్

ఇప్పటికె ఉక్కుపిడుగుల చొప్పు నడరు
మనదు భటయోధముల నవ్యమహితశిక్ష
ణావసరమున నొనరింప గావలయు న
ధర్షణీయ స్వరూత్కరాదర్శములుగ

అనువగు శస్త్రాస్త్రంబుల,
నాహార పదార్థంబుల,
ఘన ఘోటక దంతావళ
గణముల, ఘోర శతఘ్ని
దళముల, పశుమానుష వై
ద్యప్రవరుల దగి యుద్వే
లంబగు పర్వోదధి బో
లంగల్గిన వీరానీ
కము నడిపింపన్వలె ; నది
కట్టన్వలె మ్లేచ్ఛాతి
క్రమణం బామూలముగన్

మాతృభూరక్షణంబున మందుడైన
యట్టివాడె పో భారమీ యవని కరయ ;
కావు మృగములు; కావు నగములు; కావు
సింధువులు; కావు భారము సింధురములు !

స్వల్పసౌఖ్యంబు లాశించి జన్మధాత్రి
బరుల కర్పించి లభియించె పాయసాన్న
మనుచు దనివొందు తనయుల గనుటకంటె
తెనుగుతల్లికి గొడ్రాలితనమె మేలు !

ఈ కదనంబున విజయ
శ్రీ కరపీడనమున నలరితిమా ! గద్వా
లా కమలకు నైదువతన
మాకల్పాంతంబొదవును; అదె విఘటింపన్

కాదొక గద్వాలయె; తుర్కల యాక్రాంతిన్
బాదియగున్ సర్వాంధ్రము; పూర్ణాంధ్రాభ్యుద
యోదధి యింకున్ ధర్మచ్యుత తద్దుష్ప్రభు
తా దుర్దాంత నిదాఘోత్తప్తం బగుచున్.

కావున వీరగ్రామణులారా !
కట్టుడు నడుముం గదనంబునకున్
చేపట్టుడు జయసింధుజ కరమున్
నిలువంబెట్టుడు తెలుగుల యశమున్

అను సోమక్షితిపతి ముఖ
జనితాద్భుత వాక్యార్థంబుల్
మనముల పౌరుషమదిర
న్నినుచగ, సచివచమూనాథుల్

నినిచిరి రోదోంతరముల
"నిక్కము ! సోమధరాధిప ! మా
జననం బాంధ్రీసేవకె,
జన్యంబున రక్తాంబులతో
దానం బొనరించెద మం
తకునకు మ్లేచ్ఛానీకిని మూ
ర్ధానీకంబుల నింకన్"
అను ముక్తగళధ్వానములన్

పదిలంపు నెరటాలు కదలియాడగ నొంత
సదమల స్వాంతముల చాయలో యనమీరు
కొదమ రాయంచలకు గూర్మిసదనంబౌచు
పొదలాడె నవ్వేళ భువి దుంగభద్రమ్మ

ఎందుకో అగుపించె నీనాడు తుంగమ్మ
అతిలోక నైర్మల్యవతి యౌచు జిత్రముగ !
ఒక మహాత్ముని భవ్య సుకుమార భావనల
దలపించు స్వాదుజల లలితోర్మికల తోడ!

కాని పాఱదొ మున్ను నానారణస్యన్న
వీరోష్ణ రక్తఝరధారలం బెంపారి
మఱచెనో, లేకున్న వెఱచునో తెలుపంగ
ఆ ఘోర యుద్ధేతిహాసమ్ము లన్నేడు ?

ఆ తుంగభద్రాపగా తటంబున గల్గు
నిడుదూరు గ్రామాన నేలయీనిన యట్లు
కననయ్యె గజవాజి ఘనపత్తిగణ యుతము
మ్లేచ్ఛసైన్యం బతిరణేచ్ఛా సమాహితము

దండధరునైన దోర్దండ తేజఃస్ఫూర్తి
దండింపగల వీరమండలుల గూడి
కులశైలములనైన కుంభాగ్రఘట్టనం
బున గూల్చగల ఘనాఘనములం గూడి
చక్రవాతమునైన స్యదచంక్రమణదీప్తి
వమ్ముసేయగజాలు వార్వముల గూడి
చట్టుబండలనైన క్షణములో పొడిగొట్ట
గల శతఘ్నియంత్ర దళములం గూడి

తురక్కసేనలు నిల్చె దుంగభద్రాపగా
దక్షిణతటంబందు; దద్వక్రమాగ్ని సం
గత ధూమపటలంబు గతి నొప్పె ప్రాంతీయ
శతపత్త్రి నిర్యాత షట్పదవ్రాతమ్ము

ఉక్కుపిడుగుల బోలు పెక్కు పోటరులతో
హైదరాబాదు నగరాధిపుండు
వార్ధులింకగ జేయు పౌరుషాగ్నిం గ్రాలు
మగలతో గర్నూలు మహిభుజుండు
యమకింకరుల బోలు నతిభీదభటయూథ
కలితుడై గుత్తిదుర్గాధిపుండు

చండభండనకళా పాండిత్యమున దేలు
దండుతో నాదోని ధాత్రిపుండు
ఉద్వేలమగు సాహవోత్సాహమున గ్రొవ్వు
ధ్వజినితో బళ్లారి వల్లభుండు
తొలి పరీభావముం దొలగించుకొనగోరి
పరితోడ రాయచూర్పురవిభుండు
ఈతూరి జయలక్ష్మి చేతికిం జిక్కనని
వెనుబారుతో నిదరు జనవిభుండు

తోడుగావచ్చి విడిసి రుప్పేడుపతికి
తుంగభద్రకు దక్షిణోత్సంగమందు
గ్రాలు నిడుదూరు గ్రామాంతికమ్ము నందు
ఏధమాన జిగీషాత్త హృదయు లగుచు

ఆతురక్క సైన్యంబు కభిముఖం బౌచు
కలుగొట్ల యను పల్లికాంతికము నందు
విడిసె నలసోమపృథ్వీశు వాహినులు
తురక్కరక్తపు దృష్ణతో నాల్కలెండ

తాళద్రుసంకాశ తతదీర్ఘ గాత్రుండు
దుర్గారరోపమ స్థూలవక్షుండు
వ్యాయామవర్ధిత వరమాంసలాంసుండు
ఆజానులంబమానాంచితభుజుండు

షట్పదశ్యామల శ్మశ్రురుచిరాస్యుండు
సంస్నిగ్ధ దృఢ పీన జంఘాద్వయుండు
అవిదార్య వర్మావృతాఖిలశరీరుండు
వర శిరస్త్రాణ గోపాయిత శిరుండు

పాణికీలిత శాతాసి పన్నగుండు
ఊర్జితార్జునాశ్వాధిరోహుండు నగుచు
ఆజ్ఞలొసగుచు నాత్మసైన్యాధిపులకు
కాననయ్యెను సోమన్న సేనమొదట

ఆతెన్గు సైన్యంబు నందు గననయ్యె
హనుమప్పనాయకుం డతులతేజుండు
పదివేల తారకల ప్రతిభాసియైన
పూర్ణిమాచంద్రముని పొల్పు నింపారి

మసకచీకటిలోనె అసమాన తేజుండు
నలసోమనాథుండు బలసంయుతుండౌచు
తుంగభద్రం దాటి, తొలిప్రొద్దు వెలుగులో
ప్రళయ రుద్రునిలీల బడె వైరిబలముపై

మెఱపుల జడివలె నాక
స్మికముగ పైబడిన విప
క్షానీకాక్షీణ ద్రవి
ణాగ్నింబడి భ్రమందిరి యెం
దఱొ మ్లేచ్ఛానీకిని సర
దారులు శలభములటులన్

ఎక్కడ జూచిన దానై
ఉక్కడగించుచు విరోధియోధాగ్రణులన్
గ్రక్కున రిపుబలముల న
ల్దిక్కుల నుండియు నెదిర్చి తేకువ బోరన్

తన బలముల గొనకొల్పుచు
ఘనజవనాంచితము స్వీయ గంధర్వవరం
బును నవగతులం దేల్చుచు
నని విహరించెను తెనుగుధరాధిపుడంతన్

పౌరుషంబును, దేశభక్తియు నపార
ధర్మనిరతియు, బట్టుదలయు, నూత్నాయు
ధంబులై పరగ, ద్విషదంగయష్టికల
సమిధలుగ నొనరించి, సమరాంగణంపు
స్థండిలమున నపూర్వ సంహనన మఖ మ్మొన
మారంభమున దేలె నాంధ్రావనీంద్ర
యోధవర్యాధ్వర్యు యూథమ్ము లంత

దివిలోన దినరాజు తేజవిస్ఫూర్తి
అత్యుగ్రమై తోచె నహమెక్కు కొలది
భువిలోన గద్వాలభూప విక్రాంతి
అత్యుగ్రమై తోచె నహమెక్కుకొలది

దివిలోన దినరాజు తీక్ష్ణాంశు జాలమ్ము
లింకించె వాహినుల నేపారు నీరమ్ము
భువిలోన గద్వాల భూపభట జాలమ్ము
లింకించె పరయోధ మృథసముత్సాహమ్ము

అతిఘాతుక ద్వీపప్రతతు లాప్లవమాన
కాలాభ్రముల లీల గదలియాడ
విస్ఫురత్ చండాసి విహ్వాలాకారముల్
సంచలన్మీన సంచయము బోల
రయచంక్రమణదీప్తి రంజిల్లు హయ హేష
లతితీవ్ర కల్లోలరుతుల బోల
అతిసంక్షుభిత పద్గవితతు లత్యుగ్ర ఝుం
ఝూలగ్న యానపాత్రాళి బోల

అహమహమికాప్తి గవియు యోధాళి రోష
విస్ఫురణ తీవ్రబడబాగ్ని విధము దోప
సారవాహినీసంగమస్ఫూర్తి గాంచి
పొంగు సంద్రము బోలె యుద్ధాంగణమ్ము

ఖణఖణా యని సాంద్ర నినదమ్ముతో దాకు
నిస్త్రింశముల నుండి నిప్పుకలు రాల
మాటిమాటికి బిట్టు మందుగుండ్లం[illegible]గక్కు
నురుశతఘ్నుల ధాటికుర్వి నెఱెవాఱ

కండలీకృత దీర్ఘ కోదండ కాండముల
వారితంబుగ శరాసారంబు గురియ
దొమ్మి యుద్ధంబులం జిమ్మిరేగెడు సింహ
రావమ్ముతో దెసలు వ్రయ్యలై పోవ

అతిభయంకర వారణాంచిత భటాళి
కరకీలితాసిరుగ్జాలంబు లగ్ని
పర్వతోత్సృష్ట తీవ్రార్చులం బోల
దుర్దాంత కల్పాంత ధ్వాన భువనంబు
చందమై తోచె నా సమరాంగణంబు

సంచలత్ఖురచతుష్క సముత్థితోత్కట
క్షోదంబు సూర్యునకు గూడుగట్ట
సంస్పందమాన నాసానిర్గతోచ్ఛ్వాస
కశ్రేణి కడ సుళ్ల గలుగజేయ
క్వణమాన కమ్ర కవికాకర్షణోత్కర్ష
సృక్కాంత ఫేనంబు జిట్లజేయ
చలదున్నమిత వాలచామరము ఛావిజయ
సింధుజాతకు బట్టు సిడెము గాగ

ఆహవానుకూలంబుగా నగ్రగామి
పార్శ్వగామి, తిరోగామి, వక్రగామి
చక్రగామియై చరియించె జన్యభూమి
నాంధ్రరాడశ్వ మతికౌశలాఢ్య మగుచు

ఆయుత్తమాశ్వంబు నధిరోహమొనరించి
ఉచ్చైశ్శ్రవంబును వియచ్చరుల పతియట్లు
దుర్దాంత విక్రాంతి ద్రుంచె నాంధ్రేశుండు
మ్లేచ్ఛశీర్షమ్ములన్ మేల్బంతిగములట్లు

తొల్లి శ్రీరామునకు దోడైన హనుమదాదుల వోలె
అండయై పోరి రాంధ్రావనీపతి కాహవము నందు
అస్ఖలితశౌర్యులై, అరికంఠలుంఠనప్రవణులై
హనుమప్పనాయకాద్యఖిల సేనానాయకోత్తములు

ఒక్కొక తెలుంగు వీరుడె
దిక్కులు వ్రక్కలు పొనర్చు తీక్ష్ణాక్రందనతో
నుక్కుం జేరిచి, పదుగుర
నుక్కడగించుచు జరించె యుద్ధాంగణమందున్

ఇట్లాభీలంబగు నని
పెట్లకు నోర్వక నితాంతవిహ్వాలమతులై
ఎట్లో బ్రతికిన బాగని
చిట్లగ నాయత్తులైన స్వీయభటాళుల్

అల్లా! అల్లా! యని పెల్లార్చుచు నైజామువిభుండంతన్
భల్లూకపు బూన్కి తోడ వారల కాతరహృదయమ్ములలో
పెల్లగు నూతనధృతి సంధిల్లం జేయగ జూచెం గానీ
పొల్లయ్యెను తద్యత్నము; పొంగెను ద్రావితసాగరమింకన్

ధారుణి నని వెనుజూపిన
వారి నధఃపాతుకమగు ప్రస్రవణంబుల్
వారిధిభంగమ్ముల నె
వ్వారికి మఱలింపగనగు బలవంతముగన్

జలజాప్త దంతలో జరమాద్రి జేరె
కలగి పాఱెడు మ్లేచ్ఛబలములం బోలె
గులకులం గూయుచుం బులుగుమొత్తాలు
చలియింపగాసాగె సకలాశలందు

పవలెల్ల బవరాన బగతురం బరిమార్చి
తత్తనూస్రుత శోణితార్ద్రాంగుడై సంధ్య
నిలుజేరు సోమన్న యెఱుపారు మూర్తియటు
లరుణాభ నలరారె జరమార్క బింబమ్ము



పొనరిన యోటమికిం గా
రణముల వెదకగ, భటనికరము హృదయములన్
ననిపించగ నవధృతి, తే
పొనరెడు నని గెల్చెడు వెరవుల నెమకంగాన్

తత్తరమున నానిశి దళు
కొత్తు జయేచ్ఛన్ నిజాము డొనరించెను యో
ధోత్తములన్ సేనాపతి
సత్తములం గ్రిక్కిఱిసిన సభనొక దానిన్

ఆసభలో స్వీయపరాభూతికి గొందఱు
వే సూచించిరి వివిధములౌ కారణముల్
అసలవి మృషలని అన్యులు వేరే మిషలన్
వెస నిర్ధారింప సమీక్షించిరి వరుసన్

ఖండింపుచు నొండొరులన్ వా
గ్ఖండనమున దేలు వీరవర్గము తోడన్
నిండిన యాసభ దినమందలి
భండనరంగమ్మునకుం బ్రతియై తోచెఁ

కనుగొన నందఱి వాదముల
న్వినవచ్చెను సోమధరావిభువీతియె యా
తని విక్రాంతికి నాధారం
బనియెడు నిర్ణయమే తుద కాశ్చర్యముగన్

ఆకులీనాశ్వ సంస్థితుడైన యాంధ్ర
విభునితో దాను బవలెల్ల విగ్రహించి
యుంట నైజాము వెంటనే యొప్పికొనియె
వీతియే సకలానర్థహేతు వనుచు

ఆల చదరంగము నందల్పాశ్వము చేతన్
బలిమిన్ బంధనమందిన ప్రభువువిధంబున్
దలపింపగ దనస్థితి నవదర్పోద్ధతుడై
పలికెన్ నైజాముధరావతి యీపగిదిన్

చోద్యముగాదా యిది! అనవద్య ప్రతాప వైశ్వానరు
లుద్యద్వైరివరూథిన్యుద్యానప్లోషకు లాహవ
విద్యాపారగు లస్మద్వీరోత్తము లొక యల్పునిచే
నాద్యంతంబోడుట! యీయవమతి నెట్లోర్తుము మదిలోన్?

అల్లాపేరిట యాపద్బారత ధరయందే
యెల్లల్లేని మహీయేస్లాం రాజ్యంబున్ సం
ధిల్లంజేయగ దివిరెడు మాదృఢయత్నంబుల్
ఘొల్లైపోవున? పొందద విజయేందిర మనలన్?

ఆతండొక క్షుద్రావనిపాలుం డల్పుం
డాతని ద్రుంచగ నరుదెంచిన దకటా! యీ
యాతత పౌరుషాన్నీకిని; యిక బిబ్బి
మూతుల మీసలు మొలువంగావలెనేమో!

పగతుర బరిమార్పగ లేకుండిన యీ
జిగిఖడ్గము లీమగపుట్టుక లేలా?
మగలై పుట్టుట మగువల పొందునకో
తగ గదనోర్విం దనులర్పించుటకో?

ప్రత్యయమున్ ఘటించి పరిపూతుం డల్లాపై
వ్యత్యయముల్దరించి పరిపంథీశాశ్వంబున్
ప్రత్యుష మొందులోన వడిదేగా నొక్కండున్
ప్రత్యయితుండు లేడ? పరికింపంగా మీలోన్

లేరా శాత్రవలక్ష్మిహారకు లీసభలో, తే
లేరా తజ్జయలక్ష్మికారకమగు హయమున్, కొన
లేరా యీవీరాసిన్ శ్రీద్రోపదగన్, మనగన్
లేరా శాశ్వతకీర్త్యాకారములూని చరిత్రన్ ?

అను నైజాముని వాగ్ధోరణి నాలించిరి ;
కానీ కదలక మెదలక కతిపయమాత్రలు వీరా
గ్రణు లటులే కూర్చుండిరి ప్రతిమల వోలెన్
మనముల సాధ్యాసాధ్యములను దర్కించుచొకింతన్

ఎంత పోటరియైన నొక్కింత మదిని
దర్క మొనరింపవలెగదా! దర్పమెలర
శేషఫణముపై మణిబొంద జేయి సాచు
ముందు, పులినోటిలో మూర్ధముంచు ముందు

అపుడొక సరదారుడు హేమాద్రిస్థైర్యుడు
నిపుణత వీరోచితవిధి నిస్త్రింశమునకు
నృపతికి వంగి సలామొనరించి గ్రహించెన్
చపలాభంబగు తదసిన్ శయకంజమునన్

అంతలో నతని విక్రాంతి కత్యంత వి
భ్రాంతులై చూచు సభ్యాళి జయరావముల్మ్రోసె
అంతలో నావీరు నౌపవాహ్యాంచిత ఖు
రాంత సంజనిత రుతు లలసల్ల ప్రాంతమున మ్రోసె

జిగిమీఱి వెలుఁగొంద జెడునేమొ కార్యమని
పొగమబ్బులం డాగి తగుమాత్ర వెలుగొందె
తొగరాయ డారేయి; అగుగదా తుర్కలకు
మొగసాలగల వేల్పు మృగలాంఛనుం డరయ

తననాథు ఖడ్గంబు తునుకలై పడినట్టు
లొక కరాళస్వప్న మొదవంగ మేల్కాంచి
సంత్రాసవిహ్వలస్వాంతయై యారాత్రి
దిక్కులం బరికించె బిక్కుబిక్కన నాంధ్ర
మహికాంతు ప్రియరాజ్ఞి మదిగీడు నూహించి

అత్యంత శుభలక్షణాన్వితంబైన
అర్జునాశ్వంబుపై నంబరపథాన
విభునితో గూడి తావిహరించినట్లు
కలగాంచి మేల్కాంచి కలయంగ జూచె
మిన్కుమిన్కున మింట మెఱయు దారకల
నైజాముదేవేరి నడురేయి లోన

పావనుండైన నైజాము పాదుసాహి
తనదు విభునకు మండలాధ్యక్షపదము
గూర్మి నర్పించి సత్కృతి గూర్చినట్లు,
తచ్ఛుభావసరంబున దనకు బ్రియుడు
క్రమమణి విభాసుర హేమకంఠహార
మొకటి ప్రియమార నర్పించి యున్నయట్లు
కలను బొడగాంచి మేల్కాంచి గళము దడిమి
కొనియె నారేయి నావీరు గూర్మిపత్ని



# పంచమాశ్వాసము

ప్రాగ్దిశాస్యాన రక్తంపుబంతి వోలె
నపుడపుడె యుదయించు నబ్జాప్తబింబ
మేలకో యగుపించె నొక్కింత విగత
కాంతిమంతమై యానాటి కల్యమందు

అవని యనుపేరి సమరాంగణమునందు
సప్తాశ్వుడను జేని సంప్రసరణమ్ము
నరికట్ట గాలమను నభియాతి పన్ను
వ్యూహమట్టుల బర్వె నీహారమపుడు

ధ్వాంతమను ధూర్తవర్తను చేత దమినెల్ల
బంధితములై పద్మబంధనగృహములందు
ప్రత్యూషమందొక్క పరమలోకాప్తుండు
స్వీయాతి శుష్మాప్తిచే ప్రక్కలింపంగ
తచ్ఛదకవాటముల స్వేచ్ఛమై వెల్వడిన
కాలాశ్వముల బోలె కంజముఖ నిర్గత
భ్రమరవారంబు లా ప్రత్యూష ముఖమందు

ఆతటిన్ ప్రాభాతశీతవాతవ్రాత
పరిచుంబితాంగుడై ప్రవిబోధముంబొంది
కాల్యవిధులందీర్చి కంజాక్షు నర్చించి
సేనాధిపులగూడి యానాటి యాహవ
వ్యూహముల జర్చించుచున్నంత సోముండు

ఆలోన నవనీశ్వరాత్యుత్తమాశ్వంబు
ప్రతిరోధివర్గాపహృతమయ్యెనని యెఱిగి
విస్తార భయశోక విహ్వల స్వాంతులై
పరుగు పరుగున బోయి ప్రభు పాదముల వ్రాలి

ఆలాపించిరి తద్వ్యయ
పాలకు లీగతి, జనపతి పాలింపుము! మా
మూలమునం గల్గె దగని
స్ఖాలిత్యంబొండు గతనిశాంతము నందున్

తివిరితి మెంతో నిసి న
ప్రవిమత్తతమన భవాశ్వపరిక్షరణకై నన్
బవలెల్లం బవరంబున
దవిలిన వ్రణముల వశమున దనులవశములయ్యెన్

వ్రాలెను ఱెప్పలు కన్నులపై
సోలెను తనువులు నితాంతసుప్తిధురానమ్రములై
వ్రీలెను భాగ్యం బాలో రిపు
లాలానము నుండి యశ్వమపహరించిరి కడకన్

గాసిజెందిన కాయము ల్గల్గనేమి?
మీదు వార్వంపు రక్షయే మాదు కార్య
మగుట దప్పిదంబిది నిక్క మవనినాథ!
యిచ్చ వచ్చిన రీతి శిక్షింపుడింక!

అను వారిపల్కులకు నాశ్చర్య విభ్రాంతు
లేపార జింతించి, యేర్పడిన నష్టమ్ము
నాత్మనొక్కింత యధ్యవసాయ మొనరించి
ఆరూఢధైర్యుడై యనె సోమవిభుడిట్లు

అరయన్వలె దత్కులహ
విరహితముగ బోరుగెల్చు వెరవొక్కటి గానీ
సరియే మిము శిక్షింపగ
జెరువుం ద్రెంచిన కితవుని చేలముగొన్నటులన్

ఉండుడు జాగ్రత నికపై
జెండాడుడు రిపుల నేడు స్థేమార్యములై
నిండారెడు నుత్సుకతం
బండింపుడు దెగ్గు లక్ష్మి భాగ్యము ననిలోన్

వంచనచే నొక వార్వము నపహా
రించిన జిక్కుదు మనుకొనిరే యతులిత హేమాహార్యా
చంచలధీరులు శాత్రవవీరుల
వంచితధృతి నిక గూల్చుడు వారల యాశాహర్మ్యములన్

నిర్ణిద్రాద్భుతనిశాతవజ్రోపములై
చూర్ణము సేయుడు క్షుద్రద్వేషణగిరులన్
వర్ణితవిక్రమపాండుయశోగణదీప్తిన్
దూర్ణంబుగనిండు జయేందిర కారతులన్

అని వీరుల బోరునకుం
గొన కొల్పుచు, సోము డొక్క గోడిగపై దా
నొనరుచు బెనగెం గానీ
రణమత్తటి జాల దుస్తరంబయి తోచెన్

కట్టియులి తోడ గ్రావంబు గత్తిరించు
శిల్పి చందాన, పూరితో సింధురమ్ము
బంధనము సేయగను నిభపాలు డవిము
నిజ కులీనాశ్వముంబాసి నృపవరుండు
వ్యర్థయత్నంబు గావించె వైరి గెల్వ

భిదురముం బాసిన త్రిదశవిభుని పగిది
అరణి మథియింపగాలేని యజ్వ కరణి
నిజ కులీనాశ్వముంబాసి నృపవరుండు
జన్యరంగాన రాణింప జాలడయ్యె

ఎంచ హైమంతరవి వోలె గించిదల్ప
శక్తి యుతుడైన సోమన్న చంద మరసి
రిక్కలంబోలె జృంభించి యుక్కడంచి
యరుల, నోటమిం దప్పించి రతని భటులు

అంతలో భువనాప్తు డస్త్రాద్రికిం జేరె
ప్రాంత్య యుద్ధాంగణ ప్రస్రుత క్షతజప్ర
వాహానుషక్తిచే పరిశోణితంబైన
తుంగభద్రాకాంతి తోరమై పర్వెనో
జగమెల్ల ననబొల్చె సంధ్యోపరాగంబు

తమ నెలవులం దరియు పతగముల కరణి
క్లమక సమరాంత సంక్రాంత గాత్రులైన
యవనవీరులు, దెన్గుయోధవరులంత
విశ్రమింపంగ జనిరి తమిస్రయందు

అనిశాముఖమందు నాహవవ్యూహముల
దర్కింప స్వీయయోధాగ్రణుల రావించి
గద్వాలభూజాని ఘనమాన దేశాభి
మాన మానితమైన వాణితో నిట్లనియె

కౌక్షేయక బలదీప్తిం గార్యము సాధింపగలే
కక్షీణోపధులై రిపులశ్వముగొని యాంధ్రధరా
ధ్యక్షత గెలువంబూనిరి; తద్వంచన కాత్మేక్షిక
నీక్షించిన ప్రతివంచనయే యౌషధమగుగాదా!

కాలిలో ముల్లు దీయంగ గాదొకింత
యర్థమసి; ముల్లు దీయంగ నర్థమగును
ముల్లెకాని; ఈన్యాయమే చెల్లు ఖండ
నమ్ము లందును; రాజకీయమ్ము లందు

ఈవిధి బ్రతివంచనచే
మావార్వము బ్రత్యుషస్సు మలసెడులోగా
లావుంగడకయుదగ దే
గా వేదొడరెడు మగండు గలిగిననేనిన్

వానికి నిచ్చెద నాయా
జానేయం బొకదినమున ఝుంఝూత్వరితం
బోనేర్చిన యంత తత
క్షోణీఖండము నుపదగ సుప్రియతాప్తిన్

లేడా మీలో తీవ్ర
క్ష్వేడాకంపితసపత్నసింహుడు, విజయో
ఢాడోలీకృత నిజధై
ర్యాడంబరుడగు మహాబలార్కుండొకడున్

వానిది భాగ్యవైభవము, వానిది సార్థకజీవనంబు స్థైర్యా
నూనత శైశిరాల్పతుహినోపమమైన యనిత్యసౌఖ్యమాయా
ధీనత నుజ్జగించి యతిధీరత నెవ్వడు మాతృదేశ సంర
క్షానయవృత్తికై తనువు, స్వాంతము నొడ్డి సదా శ్రమించనేర్చున్

పుట్టువొందుదు రెందఱో పుడమియందు
కాని వారిలో నెవ్వండొ ఘనుడొకండు
త్యాగశౌర్యాభిరతిచేత దరతరమ్ము
లకు శిలముగాని జాడల రచనసేయు
కాలనిమ్నగాకూలసైకతము లందు

విశ్వజ్ఞేయంబుగ నేవీరుడు మాతృధ
రాశ్వశ్రేయసనసిద్ధికి బ్రతుకు వ్యయించున్
శాశ్వతముగ ధ్రువతారా సంకాశంబుగ
విశ్వచరిత్రాంబరమున వెల్గునతండే

వచ్చుంగావుత వైరుల పాలిటి వి
వ్వచ్చుండిక నీపరిషన్ముఖమునకున్
ప్రోచ్చండసహోయుక్తినియుక్తిన్ వే
దెచ్చుంగావుత దేజిన్ జేపటిలోన్

ఉత్తారింతుముగాక రి
పూత్తమగళముల నవారితోద్ధతి జేపనిలోన్
ఇత్తుముగా కద్భుత విజ
యోత్తమహారతి దెనుంగునుదధిసముద్భవకున్

అను సోము మేఘనిర్హ్రాదవాక్యంబు లాలించి
సభ కొంతవడి నిస్తరంగాబ్ధిచందమ్ము నిశ్శబ్దమయ్యె
ఉద్వేలమై పర్వు నుత్సుకత నంత నాసభయె
పర్వాంతవేలా సముత్సేధ వార్ధికోలాహలంబయ్యె

పాల్కడలిలో నుండి పైకుబికి లేచు
తారాధిపతివోలె దరుణుం డొకండు
లేచి నిలుచుండి యొనరించె వందనము
ప్రభునకున్ సభికవర్గంబునకు నంత

చనలేదు పాతిక వసంతమ్ములేని
ఆంధ్రసర్వంసహోద్యానవనమందు
ఇక్కనౌ లేమావిమొక్కయై యాత
డేనాడు జనియించె నానాటి నుండి

ప్రతిపక్ష దుర్గారర స్ఫుటన పాండితీ
భాసురం బావీరు బహుయుగళి
ప్రథనాంగణప్రాప్త బహుకిణాంకిత మతి
కర్కశం బావీరు కాయయష్టి

శత్రునృప ధైర్యద్రు సంప్లోషక దవార్చి
యావీరు తీక్ష్ణ వీక్షాతపంబు
ఆంధ్రరాజ్యేందిరాహాసనమ్మోద ర
సోద్గార మావీరు నుత్స్మయంబు

దేశసంరక్షణవ్రతదీక్షితుండు
స్వామిసేవాంకితాంగవాఙ్మానసుండు
గంధవాహాత్మజనిభుండు కాదెవండొ
శ్రీయుతుడతండు హనుమప్ప నాయకుండు

మిన్నంటు సభాస్తార జ
యోన్నతరావములమధ్య నుద్భట ధృతి మా
నోన్నమిత మనుండయి యనె
సన్నుతముగ నిట్లతండు క్ష్మాకాంతునకున్

ఆర్యా! నిరతభవాభిహితార్థ సు
కార్యాప్రసితంబు యోధకాయంబేలా?
భూర్యాడంబర పూర్ణంబయ్యు గ
దర్యత వర్షము గురియని స్తనయిత్నువటుల్

మీదు నాస్థానపుందోట మీకటాక్ష
సేచనంబున బెరిగిన చిన్నిలతల
మేము; మాశౌర్యగంధసమృద్ధిచేత
నెమ్మదిం గూర్చుటయె మీకు నిశ్చయముగ
ఫలితమగుగదా! మాబోంట్ల ప్రభవమునకు

ఆజ్ఞాపింపుడు దేవా! అరుణోదయ మొదవెడులోగా స
ర్వాజ్ఞాద్భుతశౌర్యాప్తిన్ బరిపంథిపురాద్రిని జొత్తున్, వి
శ్వాజ్ఞేయంబుగ దెత్తున్ వార్వంబున్, నావిజ్ఞాపనమున్
ప్రాజ్ఞుల్మీరలు భావింపరుగాతన్ గర్వాలాపముగన్

ఆతపంబున జృంభించు నగ్ని పగిది
మీదు కార్యంపు గాఠిన్య మేదురాత
పస్ఫురణ చేత మచ్ఛౌర్యవహ్నిరేఖ
కెరల దలకొంటి నీ కార్యభరణమునకు

అల పరమాత్ముండగు రఘుకులతిలకునకుం
జెలువుగ దోడై చెలగిన పావని భవమటులన్
జెలువారుత మీ శ్రేయోలక్షితమగు నీ
యలఘూత్తమ కార్యాసక్తి న్నాప్రభవంబున్

దుర్దాంత వైరిశుద్ధాంత దోషాకరాస్యద్యుతిన్
దోర్దండరాహుసంగ్రస్తి దూరించు యోధాగ్రణుల్
వేర్దన్ని యిందు గొల్వుండ, బ్రీతి న్ననీ యర్థమై
నిర్దిష్ట జేయుట ల్నాదు నిశ్శ్రేయసార్థంబెకా !

పలుమాటలతో బనియేలా?
తలదాలిచి మీదునాజ్ఞ బ్రదచ్చెద వైర్యర్ణవమున్
దెలవారకముందే తెచ్చెద
గులహయమున్ నన్ననుపుడు గూర్మిం దీవించి యికన్

అనిపల్కి, ప్రభుదీవనలు దాల్చి
హనుమప్ప కార్యోన్ముఖుండయ్యె
జనకజాన్వేషణాసక్తి జను
హనుమప్పవలె నతడు గననయ్యె

యవనసైన్యంబునం దలరారుచుండు
వాజి వారణ వృష కదంబములు మెండు
వానికై కొనసాగె నవ్వారిగాగ
యవనసైన్యంబు గ్రాసంబు ననుదినంబు

ప్రాంతమున గల్గు పల్లెల పట్టు నుండి
జానపదు లెందఱో యిదె సమయమనుచు
దెచ్చి చొప్పయు గడ్డియు బెచ్చుగాను
విక్రయింపంగ జూతురు విత్తమునకు

అమిత బడబానలాభీలమయ్యె నబ్ధి
క్రమ రత్నాకరంబౌట గామ్యమయ్యె
క్రూరమయ్యెను దౌరుష్కవార మపుడు
కామ్య మయ్యెను ధన సమాకర్షణమున

తొడదాక దొడిగిన తురకలా గొక యింత
కనరానియట్లు పంచెను ధరించి
వెడదయురమ్ముపై విశదంపు పొట్టి చొ
క్కా నొక్కదాని జొక్కముగ దాల్చి
ఉత్తమాంగమ్ముపై నెత్తైన క్రొత్త చెం
గుల తలపాగ నేర్పులర జుట్టి
తలపాగపై తిమింగిలమంత పొడవు లా
వునుగల్గు చొప్పమోపును వహించి
ముంజేతి కడియంబు మురువొప్ప కెంజేత
దరశాతి శాత దాత్రంబు బట్టి
వక్కాకు సున్నంబు, చొక్కమైన పొగాకు
గలసంచి మొలత్రాట గట్టి యుంచి

చప్పుడింతయు జేయని చెప్పు లంఘ్రు
లందొడిగి హనుమప్ప యానందవేళ
చొప్పనమ్మెడు బేహారి చొప్పు దోప
తురక శిబిరంపు సరణులం దిరుగ సాగె

అటునిటు బోవక నొక హయ
కుటీర నికటమున నతడు గ్రుమ్మరసాగెన్
దటుకున నాతని తలపై
బటువగు మోపుం గని హయవాటీపతులన్

దరికి నతని రావించి యాకరణి బల్కి-
"రోయి భాయి! ప్రొద్దయ్యె మాకోయి! జల్ది
చెప్పగావలెనోయి; నీ చొప్పమోపు
నెంతధర కిత్తువో భయమింత లేక

అననాతం డిట్లనె "నో
జనాబులారా! భవాశ్వ సంతతి కొఱకుం
గొనివచ్చితి నిది కాదా!
కొనుడిక గాదందున తమకోర్కి-ని నేనున్

అయ్య! జ్యేష్ఠమాసంబునం దంకురించి
సరిగ నిలువెత్తు బెరిగిన సజ్జ జొన్న
చొప్ప యిది! దీని మనసొప్ప జప్పరించి
చెంగలించు నెలమి నే తురంగమైన!

ముదురు దంటులు లేవిందు, ముద్దులొలుకు
వెడదయాకుల మవ్వంపు నిడుద దంట్లె
కాని! కాన సాయబులార! దీని దిను మి
రాయివలె నెట్టి గడ్డు పటాణి యైన!

ఇంతింత యననేల? ఇత్తురా పదివేలు ?
చొప్పదంటుల కేను జెప్పిగొన్నం గాని ?
ఇప్పింపు డయ్యా నా కేడు రూకలు చాలు !
ప్రొద్దయ్యె నింటికిం బోదునింక బిరాన !"

అమరగ నామూల్యంబున
కమితాశ్చర్యం బెడదల హయవాటీశుల్
భ్రమిత భ్రుకుటీ యుతులై
అమర్షపథులై పలికిరి యాతని కిటులన్

"ఏమి కొనివచ్చినది హేమభూమిధరమొ ?
కాక రజతాద్రియో లేక క్రమ రత్న
నిధియొ ? నీయాశ కింతైన నియతి లేదె ?
నీదు దారిద్ర్యముం దీర్చుకో దలంతొ ?
యీరవంత బేరంబుతో నీక్షణంబ ?

పూరి నమ్మవొ మున్నెప్పు డోరి నీవు ?
గ్రుడ్డివారమె ? మేము నీగడ్డి కేడు
రూక లివ్వంగ, దీవాన రూపు దోచె
టీవు ; జావురే బద్మాష జావు జావు !"

అనుచుం గొల్లున దురకలు
హనుమప్పం గని రుసరుసలాడిన నాతం
డనువొప్పగ శాంతుండై
యనె నీగతి నా తురుష్కహయపాలురకున్

"కోపమెందుకు బాబు ! కోటి దండాలు
మీకు ! నేనన్నధర మీరిత్తురాయేమి ?
మీయిచ్చ యేదియో మీరడుగరయ్య !
అమ్ముకొనుటకె కదా ! ఆయాసపడుచుంటి !

కట్టెండ, పైపెచ్చు బెట్టిదంపు బవరంబు
మట్టముగ నశియించె మణిపూసవంటి గడ్డి
ఎట్టెట్టొ యీకట్ట గట్టితెచ్చితిని బాబు !
చెట్ట దలపక తమరు చింత సేయంగవలయు
బిట్టైన నా కస్తి ! బేరమాడుటకు ముందు !"

అనినం బల్కిరి తుర్కలు
"మునుకొని నీవా జముపురమునకుంజని తె
చ్చినగానీ నీవడిగెడు
ఘనమూల్యం బీగ మేము కడుదేబెలమే ?

మాల్ ఖరీదెఱుంగక నీదు మదికి వచ్చి
నట్లు వాగిన బేరమెట్లాడవచ్చు?
ఏడువీసాల మాలున కేడురూక
లిచ్చి కొందురెవ్వారు నీ పిచ్చిగాని !

ఇచ్చిన నిమ్మీ చొప్పను
బొచ్చెములే కేడు వీసములకున్ లేదా
పచ్చినదారిం బట్టుము
చెచ్చెర నీవిందు నుండ జెల్లదు సుమ్మీ !"

అను హుంకారంబులకున్
హనుమప్పోత్కట భయవినయమ్ములు నటనం
బొనరించుచు మ్రాదరవ
ప్రణుతంబుగ బల్కె వీతిపాలుర కిటులన్

"సర్వముం దెల్సియుండియు సాయబయ్య
లార ! యీరీతి నడుగ న్యాయంబె మీకు ?
పేదవానిని, కలదు గంపెడు కుటుంబ
భరము; దీన రావలదె మాబాబు కొక్క
గ్రుక్కెడంబలి యీప్రొద్దు గ్రుంకు వేళ ?

కొండంత మోపయ్య ! కండలన్నియు బిండి
కట్టితెచ్చితి నయ్య ! అట్టిట్టు లనబోక
రెండు రూకలనైన నిండయ్య ! నీరెండ
వెలుగులో జల్ది నే నిలుజేరుకొందయ్య !"

అనుచుం బల్కుచు నుండగ
ఘనగర్వోన్మత్తులు ప్రతిఘామయచిత్తుల్
వినయనివృత్తుల్ తురకలు
హనుమప్పం జేరి కపటహాసోదయులై

జావారే హర్రాము జావారే యనె నొకడు
లేవారే ముఫ్తుమే లేవారే చొప్పననె నొకడు
బేవకూఫ్ వీనితో బేరమేలనె నొకడు
పోవురే తుమ్హారె గాంవుకో యని త్రోసె నొకడు

వారీగతి జెలరేగగ
వారల సౌమ్యం డొకరుడు భాయీ ! వీనిన్
హైరాన్ జేయగ వలదని
వారించి యితర తురుష్కవర్గము కనియెన్

"వీడు దీవాన ! పోనిండు వీని నురక !
బలిమి వీని మోపును గొన్న గలుగు మనకె
కీడు ! ఈవార్త విన్నచో రాడెవండు
గడ్డి నమ్మంగ నిటకు నేకరణి నైన !

ముందె హైందవుల్ రాకుందు రిందు భీతి
పైని నీవార్త ప్రాకెనా ప్రాణమేని
బుచ్చి యుపవసింతురు గాని పూరిపుల్ల
నైన దెత్తురా మన వృషభాశ్వతతికి ?

ఇదె పోనిండిక నీదీవానన్
అదె భానుండపరాంభోనిధిలో బడియెన్
మదిరాశాలలు మనకై వేచెన్
పదండి బిరబిర దదీయవాటికి నిపుడన్"

మదిర పేరు విన్నంతనే మదులు చెమ్మ
గిల్ల బానశాలకు జేరి రెల్లవారు
మధువునకు, మదిరాక్షుల యధరసుధకు
బట్టువడుగదా భువినెట్టి జెట్టి యైన !

అట్లు వారలేగిన బీడ పెట్టిపోయె
ననుచు హర్షించి హనుమప్ప యశ్వశాల
నంత గాలించె గాని యందర యడయ్యె
ఏమిపాపమొ యకట! సోమేశుహయము

వైరిభటు లెవరైన ప్రాంతమున నీక్షించు
చుండిరోయంచు దా సూక్ష్మముగ బరికించు
కనరాదు, హయము నేకడ దాచిరో యంచు
మందురాంతరమంత మఱిమఱిం గాలించు

ఇనుడబ్ధి బడసాగె, నింక గనకున్న
ఘోటకము నేప్రభున కొనరించియున్న
ప్రతిన నేరీతి సార్థకము నొనరింతు ?
అనృతవైతరణి నేయటులం దరింతు ?

అనుచు జింతించు, పరమాత్మానుకంప కొఱ
వడిన గూడునె కార్యభరమంచు వాపోవు
నాది సీతాన్వేషణాతురస్వాంతుడౌ
హనుమప్పవలె నప్డు హనుమప్ప నాయండు

పలికితి బీరంబులు ప్రభు
కెలనన్ ఘోటకమును గొనకేమొగమిడి యా
యిలపతి మొగముం జూడం
గల నేగతి నావిఫలత గథనము సేతున్ ?

ఈకార్యము వహింప జేకూరు నాకు
నవయశోమణిమయోన్నత మకుటమంచు
నేనిందునకు నిచ్చగింపంగ లేదు;
తురగమ్ము ఘూకాంతుతో జేర్పకున్న
విరుగు నాంధ్రోద్యమము; వెన నంతరించు

దురక ప్రభుత్వంపు ద్రొక్కిడుల నలిగి
ఆంధ్రమా భాగ్యసుమమంచు దలకొంటి;
నైన దైవఘటనం బటిన కార్యంబు
లమరునే వట్టి పురుషార్థంబువలన ?"

అని చింతించును; ఈనా
వను దరిజేర్చెడు భరమిక పావని ! నీదే
యని కులదైవము ప్రార్థిం
చును; కఠినస్వామికార్య సుధురానతుడై

కరుగబోసిన యినుమట్లు స్థిరతనుడిగి
యిట్లు కొన్ని క్షణములు యోచించె నతడు
పైని ఘనమైన యినుమట్లు బూని స్థిరత
మెఱయగా మదియందొక్క మెఱుపుటూహ
సాగిపోయెను శిబిరంపు సరణులందు

అతిభారమగు మోపు నౌదలం ధరియించెగాని
అతడు గమియించె బృషదశ్వ సంస్పర్థి జవనాప్తి
చతురబ్ధి సంపూర్ణ జలపూరముం బూని యైన
అతిజవాప్తి జరించు నంబుదశ్రేష్ఠంబు రీతి

బిరబిర నిటుజని యాతం
డరసెనొక రహస్య రాజహయమందిరమున్
వరలును నై జాము ప్రము
ఖ రసాధిప హయములందు గడురక్షితమై

అందుం గన్గొనె నాతడు
బృందారకహయనిభంబు విశదాభంబున్
సుందర శుభచిహ్నాభి
ష్యందంబున్ సోమభూప హయరాజంబున్

ఆతురగముగని యాతం డమితప్రమదో
ద్భూత ప్రతినవ పులకాంకిత తనుడయ్యెన్
ప్రాతి నశోకోపవనిన్ సీతం గాంచిన
వాతజు వైనం బాతనిలో గననయ్యెన్

ధ్వాంతమున బొడసూపు చంద్రముని రీతి
దుర్దినంబున బొడసూపు ద్యుమణి రీతి
నతని యతికాతరిత హృదయాంతరమ్ము
నతి నవాశాతప ప్రభాసితము జేసె
నతుల భద్రాంకితంబౌ తదశ్వమూర్తి

అటులన్ సంహృష్టాంతరుడై యత
డటునిటు గని చూపోవ్ యమ్మా! చొప్పని యఱచెన్
స్ఫుటమగు నాయఱపున్విని తద్హయ
కుటీరపాలుడు చెంతకు గుతుకంబున జేరన్

ఆసందడికిం దలకుచు
శ్రీసోమాధిపహయంబు చిట్టాడుచు బి
ట్టాసన్నధరం గన్గొనె
గ్రాసధురావహుని దెన్గురాడ్భటవరునిన్

హనుమప్ప నాయకుని ఆహయము గుర్తించి
ఎనలేని యెలమిచే నెంతకాలానకో
జనకునిం గన్గొన్న చంటిపాపని పగిది
కనుల కాంతులు నిగుడ, గర్ణములు నిక్కించి
గొనబొప్ప గట్టుకొయ్యను జుట్టి చిట్టాడు
చును, బిట్టు సకిలించుచును సందడింపంగ
గని యా తురంగమున్ హనుమప్ప నేకముగ
ననుమానపడె నిట్లు యవనాశ్వ పాలుండు

భాళారే : ఘోటకమిది బాల్యము నుండియు రేగడి
నేలల నెండిన దంటుల నెప్పుడు మెసవుచు నుండుటచే
దాళక నీతనిగని కడుపత్తర మందుచునున్నది
యీలాగెందుం గందుమె యిల నాజానేయములందున్

ఎండుపుల్లల జూచి యిగిలించుచున్నయది
కొండకోతింబోలె గుప్పించుచున్నయది
చండవాతాహతిం జదలంటగా నెగయు
నెండుటాకుంబోలె నెగసి పడుచున్నయది

ఈయశ్వము నిటులే నందడి
చేయగ నిచ్చిన గూల్చునుబో
ఈయశ్వాలయమున్ సాంతముగన్

కావున నీయెండిన దంటుల
వావిరిగా గొనియిడి దీనిం
గావింపంగాదగు శాంతముగన్

అనుచు దలపోసి హయపాలు డనియె నిట్లు
"నీదు మోపు నెంతఖరీదు కీదలంతొ
నుడువగా దగునోయి బీతుడిగి, పెక్కు
మాటలాడక మా కొక్క మాటలోన"

అననిదె సమయం బనుచున్
ఘనమోదంబున నతడనె ఖానూ! ఆశిం
పను బెచ్చుగ నేనొక కా
సును గానీ సతతధర్మసుస్థిరమతినై

ఆజుపీసాలు దయసేయుడయ్య చాలు !
గబ్బిగుబ్బలి బోలు నీగడ్డిమోపు
నిప్పుడే మీదు ఘోడాల యెదుట వైచి
చల్లగా బట్టిపోదు మా పల్లెబాట !

పొట్ట గడువని పేదపుట్టుకలు బాబయ్య !
మీరొసగు కాసులం బిరబిరం గొంచు నే
బోవకుండిన లేవబోదయ్య ప్రొయ్యిలో
పిల్లి ! వలదయ్య యీపీడ వైరులకైన !"

అనెడు హనుమప్ప నుడులకు యవనభటుడు
"ఎంత వెట్టియొ లేకున్న నింత చౌక
ధరకు నిచ్చునా యెవడైన ధాత్రినింత
మోపు" ననుచు హర్షించి, ఆమోపు విలిచె

హనుమప్పయుం దాని నాంధ్రవిభు నశ్వంబు
ముందటన్ విదలించి ముదమారగా వైచె
ఆవేళ నావీరు నాత్మఫలకమ్ముపై
ఆమందురాంతరమె అముద్రితంబయ్యె

ఈలీలన్ మోపును హయ
పాలునకున్ విక్రయించి, పాయక యచ్చోటు, పి
త్ర్యాలయ సవిధస్థలి సిక
తేలన్ వెదకంగసాగె నెదియో తత్పరుడై

కాల నిసుకను దున్నును; కేల నిసుక
నెత్తిపోయును; కొంగయట్లిలకువంగి
సూక్ష్మముగ బరీక్షించును; జుట్టు దిరుగు
నతుల పర్యేషణాసక్తి నపుడతండు

ఇటులతడుండగ నొకభటు
డట కేతెంచి యమితాగ్రహంబున "హరాం!
ఇట నీవేలుంటివి" యన్ని
కటువుగ దిట్టిన నిటులనె కలగుచు నతడున్

గడ్డి నమ్మితి నిప్పుడే ఖానుసాబు!
కాని యాసొమ్ము నేపాపకారణమ్ము
చేతనో గోల్పడితి నిందు జెడితి, నయ్యొ
కేలజిక్కిన యమృతమ్ము నేలకొలికె!

ఱెక్కలాడిన డొక్కాడు, లేదొకింత
అన్యవిధమగు నార్జితం బందుచేత
గోలుపోయిన సొమ్ము నీనేల లోన
నెమకు కొనుచుంటి దాము మన్నింపవలయు!

అనిన యవనుండు జల్దీగ నరసికొనుము;
ఎల్లకాలము నీవుండ జెల్లదిందు;
అనుచు నేగెను; ఆపైని నన్యు డొకడు
వచ్చి యడిగెనట్లె, యతడు వల్కెనట్లె

"ప్రాప్తముండిన నేల బడిపోవునా ధనము ?
ప్రాప్తముండని ధనము పదివేలయేండ్లీవు
కాగడాలంగొంచు గాలించినం జిక్కు
నా ?" యంచు బల్కెచనె నతడు వేదాంతివలె

ఇట్లు లెందరో భటులట కేగుదెంచి
పృచ్ఛగావించి యేగిరా వీరవరుని
ఒకడు నగె; నొకడు గినిసె, నొక్కడపహ
సించె, నింకొక్క డనుకంప నించి కాంచె

వారేమియనిన వినటం గూరక, ధ్వాం
తారంభంబగువఱ కాతండటులే జుఱుగుచు నుండెన్
బారులుగొని యార్భాటించిన గానీ
ఫేరవము ల్వెఱపించునె ద్విపభిదంబు మృగేంద్రింబున్

పదపడి ధ్వాంతం బంతట
నదనను కంసాలి విశ్వమను పాత్రంబునకుం
గుదురుగ మసితో బట్టిన
ముదురుకళాయియొ యనంగ బొదలెను రోదసిలోన్

కొందఱు కల్లుద్రావ మఱికొందఱు గూడి నమాజుసేయగన్
కొందఱు పచ్చిమాంసమునె కోరికమీరగ మెక్కి త్రేన్చగన్
కొందఱు సానికూటముల గుల్కగ నందఱు నందఱై ద్విష
ద్బృందము లేగ నాస్థలము వే విజనంబయిపొల్చె నత్తఱిన్

ఆతండదియే యదనని
ఓతుపురీతిం బదరుతి
యొక్కింతయు లేకుండన్
జక్కంశాలం దరిసి త
దంతరమున లేడితరుం
డని నిర్ధారణమొనరిచి
యందున జొచ్చెన్ సంహృ
ష్టాంతరుడై త్వరతోడన్

సద్దుమనిగి శాత్రవాళి
నిద్దురించు దాకనిందె డాగియుండెదన్
ఒద్దికం దెనుంగుజేని
ముద్దుతేజి గొంచు ముదముమీఱ నేగెదన్

అని నిశ్చయముసేసి ఆవీరు డాంధ్రదేశ
ఘోటకము ముందుగల గాటిలోనంజొచ్చి
గడ్డియుం జొప్పయుం గప్పికొని నిలువెల్ల
నాన్యోపలక్షితం బగురీతి శయనించె

నివురు గప్పిన నిప్పువోలెం
బొదను డాగిన పులియుబోలెన్
జలదనిహ్నుత సవితవోలెన్
అతడు డాగెను, అశ్వశాలను

ఊపిరాడదు సుంత; ఉరుఘర్మహారిలో
దనువెల్లయుం దోగె; తనుకీటకమ్ముల బె
డద తాళరాదయ్యె; కదలాడ కింతయున్
శయనించె నతడట్లె; చలియించునా ధీర
చిత్తమ్ము లిలనెట్టి చేడ్పాటు లెదురైన

అతడట్టుల మఱుగైనన్
మతిసెడి ఘోటకమంతన్
బహుళశ్వాసస్పందిత
వక్షఃప్రోథంబగుచున్,
సూచీకృతకర్ణంబగు
చున్, సంఘూర్ణితవదనం
బగుచున్, తీవ్రహేషా
ప్రతినినదత్ప్రాంతంబగు
చున్, చలితాలంబంబగు
చున్, సంచాలితవాలం
బగుచున్, గ్రంథితకేసర
మగుచున్, సంక్షోభింపన్

కట్టుత్రాడుతోడ మూల
ముట్టుగాను లేచివచ్చె
నట్టె పుడమి జీల్చికొంచు
బిట్టు వాడిమొనగలట్టి
కట్టు నిసుపగూట మంతటన్

అట్లు విడివడి స్వైరిత సశ్వసదన
సవిధదేశాన జరియింపసాగె హయము;
గుబ్బిమేగెను గూటముం,గొంచు ననెడు
నానుడియె సార్థకంబై పొనర్చుచుండ

అంతనొక యామికుం డాహయము నీక్షించి
రభసంబునం దాని రజ్జువున గ్రహియించి
గాటికడ గ్రమ్మఱం గట్టంగ నుంకించి
గూటమున్ భూమిలో నాట నారంభించె

వేయిహయములు శక్తితో విక్రమించి
ఊడబెఱికిన రాకుండ యుండవలయు
గూట మిదియంచు బలిమిమై నాటజొచ్చె
పుడమి లోపల నాతండు పూన్కి తోడ

కాని సూచ్యగ్రతీక్ష్ణంబు తద్ఘన కీలకాగ్రంబు
యోగనిద్రం దేలు నాగేంద్రపర్యంకు చందంబు
గాటిలో నిదురించు గద్వాలభట దక్షిణకరంబు
సూటిగా జీల్చికొని క్షోణిలో దిగజొచ్చెను గరంబు

ఏవేళ బూనెనో ఈకార్య భరణంబు
ఆపదలె యెదురయ్యె హనుమప్ప కనిశంబు
ఆపన్నులకె చాల యాపదల గల్పించి
ఆడుకొను నాటకం బబ్జాక్షు డిలలోన !

చేతిలోగల యస్త్రికల్ జిట్లిపోయె
క్షతజనిమ్నగ నవని సంస్నాత యయ్యె
కృచ్ఛ్రసందష్టమై మేను గ్రుంగిపోయె
హస్తమవనికిం దిరముగా సతికికొనియె

గరళంబు కాల్వలై కాఱంగ గోఱలం
గాలాహు లేకమై కఱచినట్లు
కొండ్లలో నిండార కుండెడంత విషంబు
కోటి తేళ్లేకమై కుట్టినట్లు
పలువాడి ములుకులం బలలంబు వెలివడం
దనువులో బలిమిమై జొనిపినట్లు
లోహకారుని కొల్మిలో కాయముంబెట్టి
సుత్తెతో బలుమార్లు మొత్తినట్లు

వాగతీతంబగు పనట వాని పాణి
నుండి వెడలి ప్రత్యణువులో నిండి నిండి
గాత్రరుహకూపములనుండి కాఱజొచ్చె
వ్యాళఫూత్కార నిర్గత క్ష్వేళమట్లు

ఇట్లు పెల్లగుబాధ మేనెల్ల దల్ల
డిల్ల మొఱయిడం దొకయింత డిల్లపడడు;
రెల్లుపోచంతయు జలింప డుల్లమందు
మల్లడించెడు శోకంపు వెల్లువలను
వెళ్ళగానీడు హృత్సీమ వెడలి వెలికి

అబలయయ్యును దొల్లి సీతమ్మతల్లి
కాకిరక్కసి వెతనోర్చి కాంతుగొల్చె
బల్లిదుండను; మొఱలిడి ప్రభునికార్య
భంగ మొదవింప నవ్వరే పందలేని !

అని స్వామిహితమునే అధికమ్ముగా నెంచి
వనజాక్షచింతన ప్రసితాత్ముడౌ మౌని
ఘనతపోగ్లాని సుమకల్పముగ గొనురీతి
పెనుబాధ లోనె యిడికొనియుండె నాతండు

అక్కట ! విసమ్మునే అమృతమ్ముగా నెంచి
పుక్కిటం గొన్న ఫణిభూషణుని చందాన
మిక్కుటంబగు వెతనె మేలుగా భావించి
ఒక్కింత సడిలేక ఓర్చియుండె నతండు

చిమ్మిరేగెడు తూఫాను దొమ్మిలోన
విన్ను నంటెడు కెరటాల వెన్నుమీద
ఎట్టులో నావ దాటింప బిట్టుదివురు
నావికుని చందమై తోచె నతనిరీతి

ఇట్టు లతడుండ దనుకృచ్ఛ్ర మినుమడించె
శూలముల గ్రుచ్చి వ్రణములో హాలహలము
నించినట్లయ్యె; నోరెండె; నేత్రయుగళి
నుండి జాల్వాఱె నేఱు లఖండముగను

ఈతెఱం గాఖిలయాతనోర్మి ముహు
స్తాడితుండై యతడు సమ్మూర్ఛితుండయ్యె
ఉల్లోల కల్పాంత కల్లోల వినమజ్జ్య
మానాంబుతరిచంద మావిధము గననయ్యె

దారుణతర గ్రీష్మతాపంబునం జొక్కి
క్ష్మాదేవి యొడిలోన సడిలేక పడియుండి
తొలుకారు చలువచే బులకింపగా వేచు
బీజమట్టుల నతడు వివశుడై పడియుండె

అర్ధమరేయి యయ్యె; దినమంతయు మార్తురద్రుంచు కేళిలో
దద్దయు డయ్యుటం దురకదండు మునింగె బ్రగాఢ నిద్రలో
నద్దుమనింగె; నల్దెసల జల్వాలపందిరి వైచె నత్తటిన్
నిద్దపు నవ్యజాత రజనీకర శీత సుధాంశువల్లికల్

ఆసుధారుజ్మ హిమ మదియెట్టిదో కాని
అది సోకినంతనే యొదవె చైతన్యంబు
మందురాంతరమందు మతిదప్పి పడియున్న
హనుమప్పనాయకుని యందకృజముగాను

అట్లు సంప్రాప్త చైతన్యుడై యతండు
చొప్పదుప్పటి డాకేల దప్ప ద్రోచి
సూచికా నిశాతేక్షణ రోచులలర
ప్రాంతదేశంబు బరికించి బాధముగను

అందున లేరని యేరును
మందునకైనను నిరూఢి మదియందున ని
స్పందేహముగా నొనరిచి
కందళితాగ్ర ప్రసూన కలితుండగుచున్

అసువు లన్నియు లోలోన నదిమిపట్టి
శక్తి యంతయు నొక్కచో సంఘటించి
లేచి కూర్చుండి పాణివిమోచనార్థి
యై శ్రమించె నాతండతివ్యథకునోర్చి

అగ్గలమగు ధృతితోడన్
బిగ్గఱగా డాకరమున బీకుచు మేకున్
లగ్గుగ దొలగింపంగా
నగ్గడుసరి చేసెనెన్నొ యత్నములంతన్

కాని యతడేవిధిం గష్టించినంగాని
ఊడిరాదయ్యె మేకొక్క యింతేనియున్
ఘనకల్మషమ్ములో గాటమ్ముగా నాటు
కొనియున్న కుత్సితుని క్రూరమనమట్టులన్

ఇట్టుల యతనము లన్నియు
గట్టుకు మోసిన శిలలటు గడువమ్మైనన్
దిట్టతనంబును వీడక
ఇట్టుల యోచించె నతడు హృదయము లోనన్

అతిభీమ మతిహేయ మత్యంతదుర్వార్య
మగు భూరిదౌర్గత్య మావహిల్లెను నేడు
తరియింతు నెటుదీని, ధరకాంతు నెటుగాంతు
వర ఘోటకక్రాంత పథికుండ నేగాక ?

ఏక్షణమందునేని రిపులియ్యెడకుం దగరాకపోరు; న
న్నీక్షణ చేసి హేయమగు హింసలబెట్టి *నిటాలనేత్రకే
ళీక్షమ కంపకం జనరు; మ్లేచ్ఛవశంబగుకంటె మాన్యతా
పేక్ష గలట్టి యాంధ్రకులవీరుల కొండవమాన ముండునే?

స్వేచ్ఛ కల్గిన ద్రుంతును మ్లేచ్ఛకులము
గండుబెబ్బులి హరిణంపు దండునట్లు
కాని చేడ్పడితి నిపుడు బోనులోన
జిక్కికొనినట్టి బెబ్బులిచక్కి నేను

కాదిది ధైర్యహీనతకు గాలము; గాలములోని మీను దా
నేదొవిధిన్ విముక్తిగన నెర్గిన రీతిగ నీకరాళ క
ష్టోదధి నీగనేర్తును; సముజ్జ్వల శక్తి నియుక్తి సప్తి నా
మోదమెసంగ నాంధ్రవిభు ముందట నిల్పెద నీక్షణంబునన్

కాల భయంకరక్రకచ కర్కశమై పెనుబాధ మేనినిం
జీలగజేసినం బ్రళయసింధువువోలె మహావిపత్తులు
ద్వేలములై గ్రసించినను, ధీరత మ్లేచ్ఛబలద్రుదావక
జ్వాలికయై మహాంధ్రరమ భాగ్యము నిల్పనియాతడాంధ్రుడే

---

*నిటాలనేత్ర కేళీక్షమ = రుద్రభూమి = శ్మశానము

అల్పకార్యము నద్రికల్పముగ భావించి
ధావించు బ్రధ్వస్తధైర్యుడై ధీరుండు
కాని కులగోత్రభరమైన కార్యంబునే
యెంచి కుశకల్పముగ నెనయించు ధీరుండు

ఈవిధి నాతడు యోచన
గావించి, లవిత్రముగొని కట్టిన కోకన్
వేవిదళన మొనరిచి! యా
పై వామకరంబున నొక పాయను గొనుచున్

కుడిముంజేతికి గట్టెను
కడుబిగువుగ నాపటంబు గడియమువోలెన్
తొడవయ్యె నదియె యనికిం
గడుదొడరెడు మగని వీరకంకణమటులన్

ఆతతచాతురీధృతిసమంచితధీయుతి నాతడంత డా
చేత లవిత్రమూని కుడిచేతి నొకానొక వ్రేటుచేత ని
ర్భీతి దెగంగగోసె,నతివేదన నంగము గ్రుంగినన్ నవో
ద్భూతమునైన స్వేచ్ఛనిరవొందగ నెమ్మది సుంత నెమ్మదిన్

అట్లు త్రుటిత్రైకకరుడైన యతడొప్పె
ఘోరసమరాంగణక్షతచంద్రహాస
సంవృక్ణహస్తాంత సంయుతంబైన
సమదవారణరాజ సంకాశు డగుచు

పెల్లగు బాధచేత దనువెల్లయు దల్లడమందెగాని తా
దొల్లి బిగించి కట్టుటను దొల్కెడు రక్తము దొట్టుతొట్టునం
బెల్లుగ జేతినుండి, యది బీజముగా నతడొందదయ్యె మూ
ర్ఛిల్లనంబు, నొప్పినిదె యుత్తరకార్యసహాయకారియై

కొంతకాలం బటనె కూలిపడియుండె
నత్యంతబాధావృతాంగుడై యతడు
నీరంధ్రనీలాభ్రనీకాశమైన
*రత్నగర్భాధర ప్రతిమానుడగుచు

కాని దుర్దినాంతరజాత గాఢచంచ
లాభ చందమాతని హృదయాభ్రమందు
స్వామికార్యైకదీక్షయే సాంద్రమగుచు
మెఱయగా నెదోవిధి ధృతిగఱచి లేచి

గుండెలుపిండు వేదనను గుప్పిటబట్టి యతండు వస్త్రపున్
ఖండము నొక్కదాని గుడికైపయి గట్టిగజుట్టి దోవతిన్
నిండుగ వల్లెవాటువలె నిల్పి నిజోర్ధ్వశరీరయష్టిపై
దండితనాన డాకయిని దాగొనివచ్చిన ప్రగ్గెనొయ్యనన్

కశ్మముగ దగిలించి కంఖాణముఖమందు
మెల్లగా వీపుపై మేలొప్ప గూర్చుండి
ఛెళ్ళునన్ మెడదట్టి ఛెల్ఛలోయంచు హయ
తల్లజము నుసికొల్ప దక్షణం బెలమిమై

*రత్నగర్భాధరము = ధరాధరము = పర్వతము

తలలో నాల్కవలెం ద
త్కులహయ మాతని తలంపు గుర్తింపుచు దా
దొలగిచనెన్ రిపుశిబిరా
వళి త్రుటిలోనన్ క్షణప్రభాలతవోలెన్

నిద్దురమత్తు కొంతయును, నిష్ఠురయుద్ధధరాభివిద్ధ గా
త్రోద్ధురబాధ కొంతయును, వ్యష్టితరాసవపానలోభ సం
సిద్ధమదంబు కొంతయును, చేరి మనంబులు మొద్దువాఱ నా
యోద్ధ రయంబునంగొనెను నుత్తమవీతినిగాంచి యామికుల్

నీటికి అశ్వీకు డెవ్వడొ
ఘోటకముం గొనుచునేగు గొబ్బున నిపుడా
యేటికి; ఊరక నాపగ
నేటికి, నిరుకుసను బెట్టనేటికి వీనిన్

అని వారూరక యుండిరి
అనృతము గాదయ్యె వారి యాలోచనయున్
గొనిపోవుట ఘోటకముల
ననిశంబేటికి భటాళి కలవాటగుటన్

అతిరయధూతవాతహరిణాద్భుతతేజవిభాసమానమై
చతురత నాతురంగము నిజాధిపుడౌ నలసోమనాథు డం
చితముగనున్న చక్కికిని జేరెదదీయభటప్రశిష్టమై
యతివరశిష్టమై హరిని నాదట జేరుమనోపమానమై

ఈవిధి జేరిచి భూవిభు
స్థావరమునకున్ హయమును, స్వప్న నిమగ్నుం
డౌవిభు నల్లన జాగృతు
గావించి యపూర్వభక్తిగరిమం బలరన్

సవ్యహస్తము నొసటిపై సంఘటించి
వంగి ముమ్మారు గావించి వందనంబు
సప్తి నాచేతనే చూపె జనపతికిని
మేరుధైర్యుండు హనుమప్ప వీరవరుడు

ఆతురంగముగాంచి యత్యంతహృష్ట
మానసుడెయయ్యె సోమభూజాని, సవ్య
హస్తమున మ్రొక్కు హనుమప్ప యనువు జూచి
కినుక నెలకొన నాతని కెలన జూచె

అంతలో భూజాని కక్షిగోచరమయ్యె
ఖండితాగ్రంబు, రక్తప్రపృషంతికార్ద్రింబు
నైన హనుమప్పనాయక దక్షిణకరంబు
అప్పుడే భూజాని హల్లకోపమమైన
వదనంబు కైరవప్రతిబింబముగ మాఱె

సప్తిసందర్శనోదిత సమ్మదంబు
సేవక కరేక్షణోదిత చింతతోడ
మిశ్రితంబైన సోమభూమీశు హృదయ
మంత గనుపట్టె ధామధూమాన్వితాభ్ర
పటల సంయుతంబైన యభ్రపథమట్లు

అంతవఱ కాఱేని స్వాంతంబులోన
భాసిల్లు కైరవవ్రతతులే మాఱె
నిందీవరంబులుగ నిపుడబ్రముగను
నీలీసుమంబులుగ నేడబ్రముగను

వెంటనే గౌరవప్రేమాభిమాన
భావశబలంబైన స్వాంతంబుతోడ
ఆశ్లేష మొనరించి హనుమప్ప నడిగె
హేతువేమని తద్విఘాతమున కతడు

అతివినయమతియౌచు హనుమప్ప యంతటన్
పృథ్వీశు కెఱిగించె వృత్తాంత మంతయున్
క్లుప్తముగ జాలతఱి లుప్తమొనరింపకన్
వృథ సేతురే తఱిని కృతచేతులింతయున్

నాన్యతస్సాధ్యమౌ ఆచరిత మాలించి
స్ఫారతరమోదవిస్మయపూజ్యతాభావ
భరితాంతరంగుడై ధరకాంతుడాతనిన్
బిగికౌగిటంగ్రుచ్చి ప్రియమార నిట్లనెన్

ఇంతటి సాహసంబు, మఱి యింతటి దేశహితైకవర్తనం
బింతటి స్వామిభక్తి, పయి నింతటి కార్యనిరంకుశత్వమున్
గాంతుమె యెందునేనియు త్రికాలములందును వీరవర్య ! నీ
యంతటివానినిం గనుట నాంధ్రచరిత్రము ధన్యమయ్యెడిన్

నీచరితంబు నిర్మలము; నీకనునన్నల జిక్కెనోయి యెం
తో చపలాత్మయౌ విజయతోయజగేహిని; నిన్నుబోలు శౌ
ర్యాచరణైక జీవనుల త్యాగఫలంబునగా దొలంగు నాం
ధ్రీచరణంబులం బడిన మ్లేచ్ఛజనప్రభుతోగ్రశృంఖలల్

గండరగండలౌ రిపుల ఖండనసేసి మహాంధ్రఖండ మా
ఖండలలోకమట్లుగ సగర్వముగా రచియింపజాలు నా
క్షొండు భవాదృశుండగు మహోగ్రరణాధ్వరపండితుండు, వే
దండసమంబులౌనె వనిదక్కిన వన్యములెన్నియుండినన్

నీదగుకీర్తి యీతెలుగునేలను నిల్చి యనశ్వరంబుగా
నూడును క్రొత్తయూపిరుల నూర్జితభావిమహాంధ్రయోద్ధ సం
ఘోదయకాయమందున, త్వదుత్తమగాథ సుధోపమానమై
శ్రీదమునై సదా తెలుగుజిహ్వల దప్పక నాట్యమాడెడిన్

ఇట్టి మహోపకారికి మహీతలమెల్లయు గాన్కవెట్టినం
దుష్టియె, యైన మామదికి దోచినయట్టుల, మాదుశక్తికిం
దట్టిన యట్టులన్ ఘనముదమ్మున నీకిదె కాన్కజేసితిం
జిట్టిదటంచు గాదనక స్వీకృతిగాంచుము దీనినెట్టులేన్

అని సోమభూపాలు డంతటన్
ఘనధరాఖండమున్ కాన్కగా నొసగుచున్
తనచేతనే దానపత్రమున్
వెనరొప్పగా వ్రాసి హనుమప్ప కొసగుచోన్

అతివినమ్రముదై హనుమప్ప యనియె, స్వామి!
సేవకునకింత మర్యాద సేయదగునె!
ఏనొనర్చిన కొలదిమేలింత సేసి
తాము నను మింటికెత్తగాదగునె దేవ!

ఓ నరపాలవంశమణి! యుంటిని చాలును మీకటాక్ష ధా
రానిరతార్ద్రమైనధర ప్రత్యహమున్ ఫలియించు దీవెనై
మానిత మామకీన తనుమానస శక్తులు మీదుసేవకై
కానుకసేయు భాగ్యమది కంటినిచాలు నికేల కానుకల్

ఉర్వీవల్లభ! మీరో
సర్వాంధ్రజనాళికి ప్రియజనకులు; దీనిన్
గర్వముతోనెంతుము మా
పూర్వాచరితాసమాన పుణ్యఫలముగన్

దోర్వీర్యంబున దనయుం
డుర్విం దండ్రిని గొలుచుట యుక్తముగాదో
నిర్వర్తించితి నావిధి
గర్వింపగ నేమికలదు కన్గొన నిందున్

ఐనను మీరూహించిన
నేనెదొ ఘనకార్య మాచరించితినని, తా
ర్కాణం బయ్యెది మీహృద
యానూనవిశాలతకు, దయాసాంద్రతకున్

ఈసద్భావమె వసుధా
వాసవ ! చాలద యొనర్ప బ్రతుకున్ బ్రమదో
ద్భాసితనందనముగ నిక
నాసింపగ నేలనయ్య యన్యము నాకున్

అనునాతని యౌదార్యం
బున కెంతో విస్మితుడయి భూమీకాంతుం
డనె నీగతి ద్విగుణీకృత
ఘనకరుణాభరిత హృదయకమలుం డగుచున్

"నీయౌదార్యము విస్మయావహము; నీకిచ్చ లేకుండినన్
శ్రేయోదాయకమౌట నీయుపద జేకొమ్ము వీరాగ్రణీ !
నాయుల్లంబును దాన సంతసమునందున్ నవీనప్రరో
హాయామంబగు క్షేత్రముంగనిన యాషాఢమేఘంబటుల్

శ్వేతపక్షంబునన్ స్థిరవర్ధమానుడౌ
శీతాంశునింగన్న క్షీరాబ్ధివోలె
ప్రత్యూషమందునన్ బ్రాజమానుడౌ
కాసారముంగన్న కమలాప్తువోలె
కేదారమందునన్ మేదురేధితమైన
రాజనము గన్గొన్న రైతన్నవోలె
ఆరామమందునన్ సారపుష్పితమైన
మాకందముంగన్న మాధవుని బోలె

ఉత్తమంబును మత్ప్రదత్తంబు నైన
విస్తారపృథ్వికిన్ విభుడవీవగుచు
ఏధనము నెందంగ నీక్షించి నేను
మోదింప మదినెంతు నాదరముతోడ

అంతియేకాక వినుమయ్య యర్కతేజ!
అర్థదత్తంబు గాకున్న యర్థమెల్ల
వ్యర్థమగు గొల్లలై వని బరిఢవిల్లి
హరిపదంబుల జేరని విరులయట్లు

అదియునుగాకన్ మునునే
నదసున జేసిన సమయము సందుష్టముగాదో?
పదపడి ననుదూఱరొ జను
లదయుండు, కృతఘ్నుడంచు నాచంద్రార్కముగాన్?

కావున రాజాజ్ఞగ నిది
భావించి కొనందగునిక ప్రతిభాదిత్యా!
ఈవిశ్వజనాళికి మన
పావనసౌహృద మపూర్వపాఠముగాగన్!

అనుజేని ఘనదిత్స నాత్మసంభావించి
హనుమప్పనాయకుం డాదానపత్త్రిమున్
ఘనమోదకలితుడై గ్రహియించి కెంగేల
గనుదమ్ములకు నద్దికొనెనంత నమ్రుడై

స్ఫారతరమైన యాసారసంప్రదాన
కలన బూరించి సారసాకరవరంబు
పారమెఱుగని తృప్తిచే పొందువైన
నీరదంబునుబోలె నానృపతిచంద్రు
డట్లు నిండిన కాసారమట్లు దోచె
అతులసమ్మోదభంగితంబైన యట్టి
ఆ మహావీరతల్లజు నాత్మసరసి

మఱియు సేనాభిషక్కుల ద్వరితగతిని
నటకు రావించి సోమధరాధిపుండు
"వైద్యవరులార ! సుశ్రుతప్రతిభులార !
నన్నుఁగా నాత్మ భావించి నయమొనర్ప
వలయు నీతని తనువున వ్రణములింక
దూర్ణముగ" నంచు వారల నిర్ణయించె



# షష్ఠాశ్వాసము

అంత హనుమప్ప హస్తాంత నిస్రుతమైన
క్షతజకూలంకషా ప్రతిబింబమోనాగ
బాఢతరరక్తిమాధ్వంబులే భాసిల్లె
ప్రాగ్దిశారోదసీ వరదర్పణమునందు

అప్రత్యుషోరాగ మాగామి చండాంశు
తీక్ష్ణతాసూచియై తిమిరంబు బోద్రోలె
అత్యంతతేజస్వియౌ వీరు విక్రాంతి
వార్తయే చాలదా వైరులం బోద్రోల ?

పూర్వదిశాకవాటమును పొంకముగా దొలగంగ ద్రోచి యాం
ధ్రోర్వరనెల్ల హేమరుచిరోజ్జ్వలసుచ్ఛవిసూనగుచ్ఛముల్
గర్వముతోడ జల్లెను వికర్తనుడంత భవిష్యదాంధ్ర మా
ఖర్వజయోత్సవార్థమయి కాంచనరథ్యల గూర్పనోయనన్

శ్రీకంఠాలికమందు జెన్నొనగు చిచ్చోయనంగన్, మహా
నాకారణ్యమునన్ జ్వలించు గహనాగ్నిచ్ఛటంబోలె, వి
శ్వాకూపారమునన్ వెలుంగు బడబాగ్నిర్వితానంబటుల్
లోకేశుండు వెలింగె దూర్పుకడ రుంద్రప్రభోదీర్ణుడై

క్షితియన్ దుర్గము గెల్వబూని సరసీజేశుండు దానాక్షితిన్
చతురంతంబుల జుట్టియున్న *యతలస్పర్శాంబరాఖాతమున్
వితతాంశూజ్జ్వలరజ్జుసంతతులతో వేవంతెనంగట్టి బల్
చతురుండై [illegible]యించెనో యన సువిస్తారంబులయ్యెంబ్రబల్

మున్నె క్షయరోగమున జిక్కి సన్నబడితి
ఇపుడు చండాంశులంజొక్కి యెండిపోతి
నింక దివినుండ దగదంచు నిందుడంత
మ్లేచ్ఛకేతనమ్ముల జొచ్చి మేలుగనియె

ఇట్లు నిరీక్ష్యుడౌ హాని నమర బూని
తురకశిబిరాగ్రములయందు దురగలించు
ధ్వజము లాగామిసమరసంప్రాప్యమాన
పరిభవంబును సూచించు ధ్వజములయ్యె

అపుడాంధ్ర సర్వంసహాలక్ష్మి వేణిలో
ప్రతిభాసితంబైన రత్నహారములట్లు
కోకనదవార మస్తోకప్రభల మీరె
రమ్యతర తుంగభద్రా వేణికలయందు

తొల్లి గగనాంచలమ్ములన్ వెల్లిగొన్న
క్షతజనిమ్నగ యల్లనన్ క్షితికి డిగ్గి
పాఱసాగెనో యన రక్తవారిజాత
పిచ్ఛిలచ్ఛవి యిలనెల్ల వెల్లివిరిసె

---

*అతలస్పర్శము=అగాధము(అగాధమ తలస్పర్శే అని అమరం)

ప్రథమరుక్స్యాతనిస్త్రింశపంక్తి చేత
చండకిరణుండు ధ్వాంతరాక్షస గళంబు
లూనమొనరింప గాఱిన శోణితంపు
వఱదలన బొల్చె రక్తాబ్జవార రుచులు

ఉరుతరతేజవిస్ఫురణ నుక్కడగించి తురుష్కవారమున్
సురుచిరమందహాసమున శోభిలజేయును దెన్గులక్ష్మి సుం
దరవదనారవిందమును దప్పక సోముడు నేడటంచు వి
స్తరముగ జోస్యముంబలికె సారసితాంబుజకాంతిపుంజముల్

ఆంధ్రరాజ్యేందిరా హాసమ్ములందొల్కు
మాధ్వీకముంబోలె మధురమంజులమయ్యె
తుంగభద్రానదీ తోయమాలికలందు
నిస్రుతంబైన నవనీరజ మరందంబు

తుంగభద్రానదీ తోయమ్ములన్ మంగ
ళాభ్యంజనస్నాన మాచరించి
వలమాన సంపతిత పత్త్రిసంవ్రాతమున్
మేల్పట్టు పుట్టముగ మేన గట్టి
నవజాత కంజాత నివహమ్ము నందముగ
నవరత్నమాలగా నవదరించి
పరిఫుల్ల సురభిళ ప్రసవ పాంసూత్కరము
భద్రాతపత్రముగ బాదుకొల్పి

కల్యాకల్యాణ సుముహూర్త కాలమందు
సర్వసర్వంసహారాజ్య సార్వభౌమ
పదవి నభిషిక్తుడౌ రాచపట్టి మాడ్కి
గర్వయుతుడౌచు గమియించె గంధవహుడు

అధికబలవత్తరుండైన యధిపు మ్రోల
మండలేశులు మకుటాళి మంటి నంట
వందనంబులు సేసెడు భంగి దోప
నిఖిల తరులతాదులు వంచి శిఖరపాళి
వందనంబులు సేసె *ప్రభంజనునకు

ఆపవనాంకురంబువలె నాంధ్రచమూశిబిరమ్ములందు సం
వ్యాపృతమయ్యె సోమవిభునశ్వము తేబడెనన్నవార్త, ప్ర
ద్యోపమమూర్తు లౌచు దెలివొందెను దాన నపూర్వగర్వహ
ర్షోపచితంబులై తెలుగుయోధగణంబుల వక్త్రబింబముల్

ఆపవనాంకురంబువలె యావనసైన్యసమూహమందు సం
వ్యాపృతమయ్యె నెవ్వడొ మహాధృతిశాలి సపత్నవీరుడ
శ్వాపహృతిం బొనర్చె నిజహస్తముగూడ ద్యజించియన్ ధృతి
క్షేపక వజ్రకర్కశ విశేషవిపత్కర ఘోరవార్తలే

జాలయి పుట్టి యాపయిని జారి జవాంచిత నిర్ఝరమ్ములై
మేలగు వాగులై పిదప, మీద మహాపగయై చెలంగు కీ
లాలవిధంబునన్ హయలలామము దెచ్చిన వార్త యాంధ్రభూ
పాలకవర్గమం దపుడు ప్రాకె నభంగురభాగ్యదాయియై

*ప్రభంజతి వృక్షశాఖాదికమితి ప్రభంజనః

ప్రాలిన యాకులందు ప్రభవంబయి మీదట దీవజొంపముల్
కీలల బుగ్గిచేసి పయి గృత్స్నమహాటవినే గ్రసించు నా
భీలదవానలంబువలె పీత్యపవారణవార్తయే తురు
ష్కాళికి సోకె భావిసమయాగమి ఘోరవిపన్నిమిత్తమై

అమితహర్షాప్తిచే జాల యరుణమైన
ఆంధ్రయోధాస్యబింబంబు ప్రహసించె
నపుడె యుదయించు బాలారుణాబ్జతతుల;
అమితహర్షాప్తిచే జాల యరుణమైన
ఆంధ్రయోధాస్యబింబంబు లపుడు దీర్చె
చెందొవలు లేని లోపముం జిత్రముగను!

అత్యంతభయవిచారాతురత నడరు
యవనయోధుల కుంచితాస్యంబు లపుడు
ప్రతిలేని సౌహార్ద్రభావంబు గనియె
ప్రమ్లాన కైరవప్రకరమ్ములందు

ఆదినమందు సోమవసుధాధిపు డర్కసముగ్రతేజుడై
ఆదిగ నస్త్రి పత్తి హయ హస్తి శతఘ్నులు గల్గు సేనతో
హ్రాదిని దాటి శాత్రవ కురంగ కదంబ హరీంద్రుడౌచనిన్
మోదిలజేసె నాంధ్రరమ మూర్ఛిలజేసె నరాతిలక్ష్మినిన్

ఆకస్మికమ్ముగా నఖిలాశలన్మ్రాగి
చీకట్ల బిగియించు జీమూతతతియట్లు
న్యగ్రోధములగూడ నామూలముగ నూడి
పడగూల్చు బెడిదంపు సుడిగాలి తెరలట్లు

గండుశిలలంగూడ ఖండింపగా జాలు
చండజవమున బాఱు గండకీ విధమౌచు
ఖాండవంబును మ్రింగ ఘనకరాళజ్వాలి
కాజిహ్వకల జాచు *కఱిదారి విధమౌచు

చండభండనపాండిత్యసారనిధులు
తెలుగువీరులు తేకువ తేటపడగ
నల్దెసలనుండి తుర్కల నావరించి
చిత్తుచేసిరి; కాన్కగా మిత్తికిడిరి.

ఆయనీకాగ్రంబునం దాంధ్రభూవిభుడు
చిత్రజవసత్వనిర్జితసూర్యవాహంబు
నాత్మీయసైంధవము నధిరోహ మొనరించి
చిత్రజవసత్వనిర్జితసూర్యు డైపొల్చి

తనబలముల గొనకొల్పుచు
క్షణవిద్యున్నిభమున నరిగణముల మార్కొనుచున్
తునియలు సేయుచు నసిద
త్తనువులు దుర్దాంతవిలయతాండవమున దేలన్

అల్లా! హరెయల్లా! యని
వెల్లార్చుచు దురకలు గడుబెగ్గిలి యంతన్
చెల్లాచెదరుగ బాఱిన
దల్లక్షణముం గని యతిదర్పితమతియై

*కఱిదారి=కృష్ణవర్త్మ=అగ్ని (బర్హిశ్శుష్మా కృష్ణవర్త్మా అనిఅమరం)

ఓడకుడోడకుండనుచు యోధుల నొక్కట జేర్చి వారిలో
వాడిమగంటిమిన్ మఱల నర్తిలజేయుచు, బ్రాగటూరి పె
న్నీడు నవోత్థితాచలితనిష్ఠురకాలభుజంగమక్రుధా
రూఢతరోజుచున్ రణనిరూఢి తలిర్ప నెదిర్చె సోమనన్

వీతుల ముందువెన్కలకు వేనురికించుచు బాణివిస్ఫుర
ద్ధేతుల విస్ఫులింగములు తీగెలువాఱగ, జైత్రమాసపున్
మోతుకులట్లు సంహననముల్ క్షతజారుణిమం దలిర్ప బ్ర
స్ఫీతకృపాణవిగ్రహవిజృంభణ దేలిరి వార లిర్వురున్

ఖడ్గాఖడ్గిగ నీవిధం బధికకౌశల్య మేపారగన్
ద్విడ్గోత్రేశుడువోర నొక్కపరి స్వీయాశ్వమున్ వెన్కకున్
త్విడ్గణ్యత్వర దట్టి, తక్షణమె వేముందుకున్నెట్టి, త
ద్విడ్గాత్రంబును దగ్గె రెండుగ బ్రధృష్ణుండు సోముండొగిన్

శోణిత మేఱువాఱ నిటు సోమనధాటికి గ్రుంది మ్లేచ్ఛరాట్
క్షోణికి గ్రుంగ గాంచి కడుక్షోభము జెందిన సైన్యరాశి, యా
దోనివిభుండు ముందునకు దూకి విరోధిని దాకె వీక, నా
సేనల యాత్మసీమలను స్థేమజిగీషల నారువోయుచున్

బిరబిర జంద్రహాసముల విస్తృతకౌశలదీప్తి ద్రిప్పుచున్
బొరిబొరి నశ్వరాజముల ముందుకు వెన్కకు దట్టి నెట్టుచున్
చురచురలాడు ఖడ్గముల పోకున నిప్పుక లొప్ప గుప్పుచున్
స్ఫురదరుణాస్రబిందువులు జొబ్బిల క్లాంతశరీరయష్టులన్

హుంకారంబులతోడ దిక్పటలి నుద్భిన్నముం జేయుచున్
లంకేశున్ రఘురాముబోలి యతులాభీలదోర్దండస
ద్యోంకారధ్వనశౌర్యగర్వమున నన్యోన్యసంస్ఫోట ని
శ్శంకోద్యోగమునం జెలంగిరి రుషాస్ఫూర్తి వారంతటన్

ఇటులెంతోవడి వారు
ద్భటదర్పోద్ధతి బెనగగ భ్రాంతుండై
యటమట జెందెను యవనుడు
తటుకున సోముం డదిగని తటిదుపమితుడై

ఛెళ్ళున నొక్కపెట్టునను జేసె ద్విఖండముగా నరాతిభూ
వల్లభు గాత్రవల్లికను, వాగులువాఱగ శోణితంబు, హో
యల్లా! యటంచు భీతులయి యావనసైనికు లెల్లదిక్కులన్
చిల్లరపోల్లరై యురుక, చేరి తెనుంగులు వారి మొత్తగన్

ఈయనువున సోమన శౌ
ర్యాయతి శాత్రవనృపోత్తమాంగద్వయముం
బాయక తఱిగినగాంచి త
దీయానీకిని ద్విగుణితతేజోద్ధృతమై

అత్యంతరయచలద్ధయ ఖురోత్థితధూళి
చే దెసల జీకట్లు పాదుకొనగ
తళతళన్నిశితాసితతు లత్తమంబులో
తోకచుక్కలరీతి దులకరింప
గాఢబృంహితభీద గజబృందముల్ ధ్వాంత
గర్జదంబుధర సంఘములబోల
ఆధోరణస్తోమ హస్తాంచితాస్త్రముల్
సంస్ఫురచ్చంచలాచయము బోల

దేశరక్షైకదీక్షయే తెరువు నూప
దుర్దమస్వామిభక్తియే తోడుగాగ
చెట్లుపుట్టలు వట్టుచుం జెదరిపోవ
తరిమి కొట్టెను బవరాన దురకపరిని

హాహాకారములుప్పతిల్ల నిటులయ్యావనుల్ బర్వగా
నోహో పాఱకుడోడకుండనుచు నుప్పొంగి బళ్ళారి రా
డ్డోహంకారముమీర, వారిబునరావృత్తులంజేసి, న
వ్యాహావోత్సుకతం దదీయహృదయావిష్టముం జేయుచున్

తాడితకుండలీంద్రుని విధంబున ద్వేషవిషప్రపూర్ణుడై
క్ష్వేడల నాశలం బగులజీల్చుచు, దంతవిఘట్టనంబుచే
నౌడును గాటువార్చుచు, మహాగ్రహసంయుతి, నభ్యమిత్రుడై
ఈడితవైరిఘాతనసమీహనదీప్తి నెదిర్చె సోమనన్

కులశైలంబులు గ్రుమ్మలాడినటులన్ గ్రుద్ధేభయుగ్మంబు ది
గ్వలయోద్భేదక బృంహితార్భటుల వ్యాఘట్టించుచందమ్మునన్
బలవచ్ఛ్వాపదయుగ్మ ముత్కటరణవ్యాలోలమైనట్లు వా
రలు దీండ్రించిరి ద్వంద్వయుద్ధమున నిర్ద్వంద్వప్రతాపోద్ధతిన్

పొందుగా వీతులన్ ముందుకున్ వెన్కకుం
బ్రక్కకుం గడువడిం బాఱజేసి
కరవాలములద్రిప్పి కవచసంధులయందు
శత్రువున్ భేదింప జాలదివిరి
అన్యోన్యసంఘాతనాయత్తి దీవ్రాసి
ఘట్టనంబులచేత గాడువఱచి
ఒక్కఁ జూపి వేరొక్కచో వ్రేయు పూ
న్కుల మున్నె తొలగి నిష్ఫలముచేసి

వారువోరిరి; తత్ఖడ్గధారలందు
డోలికారోహకేళీవిలోల యగుచు
ఎవరి వరియించు టుచితంబొ యెఱుగలేక
చంచలించెను జయసింధుజాత యపుడు

రణమత్యుత్కటమయ్యె దేహములు ఘర్మాంభఃప్రసిక్తంబులై
తనరెన్ గానుగ మొద్దులట్లు; తొలగెఁ దార్ఢ్యంబు దేహంబులన్
చనె నాస్యంబుల గల్గు తేమనము; శ్వాసశ్రేణులత్యంతమై
వినవచ్చెం గడుదవ్వులం బెరిగె నావేశంబు లుజ్జృంభణల్

ఎంతోవడి వారిట్టులు
సంతమసము నాతపంబు చందమువోరన్
శ్రాంతంబై బళ్ళారిని
యంత్రృహయం బిలకుగూలి యసువులువా సెౕ

అంత రయంబునన్ హయము నాంధ్రధరాపతి డిగ్గి మ్లేచ్ఛభూ
కాంతుని దార్కొనెం బ్రళయకాలసముచ్ఛలవాత్యయో, తటో
త్క్రాంతసముచ్ఛ్రితోర్మిభయదాంబుధియోయన విస్ఫురత్సము
ద్భ్రాంత నితాంతదారుణ కృపాణసమంచిత సిద్ధహస్తుడై

వేయియేన్గులశక్తితో విక్రమించి
తన్ను దార్కొను నాంధ్రభూధవుని ధాటి
నల్పముగనెంచి జాల్మత యవననేత
ఏమతెనుసుంత; పరికింప నిట్టివే య
గుంగదా మృత్యుదేవతోత్సంగమందు
విశ్రమింపంగ జనువారి విధములెందు

ఖంగునదాకె సోమవిభుఖడ్గము; విచ్చెను నూరువ్రయ్యలై
చెంగున మ్లేచ్ఛనాయకుని శీర్షము; పాఱెను వఱ్ఱులౌచు యు
ద్ధాంగణమంతు శోణితము: ఆఱెను మ్లేచ్ఛవరూథినీమనో
రంగములంతు మిన్కుమను ప్రాహవకౌతుకదీపమాలికల్

వరుసగ మువ్వురేలికలు వహ్నిసమానసముగ్రవిక్రముల్
నెరసులవోలె * నేడ్తెరను నెట్టన ప్రాభవమేది నీల్గినన్
దరికొన మానసమ్ము లతిదైన్యతగాంచి తురుష్కసైనికుల్
పరిమిళితప్రభూతభయవిహ్వాలులై వడిబాఱసాగినన్

* ఏడ్తెర = యుద్ధము.
(అని చివ్వ యేడ్తెర యాలము బవరము అని సాంబనిఘంటువు)

తగదు తగదు పాఱదగదు వీరులార!
మగలుగారె? మీదు మెగములందు మీస
లింక మొలువలేదె? జంకుదొలగి యంత
కాంకపాశిభాగ్య మరికి గూర్పలేరె ?

ఢిల్లీనేలిన మనకొక
చిల్లరరాయనికిజిక్కి చేడ్పడి పాఱం
జెల్లునె? పందలుసైతము
గొల్లున నగరే యిదివిన గుతకముతోడన్ !

రండు రండు పోరరండు రండికన్
చండవాత్యరీతి సంత్వరన్ త్వరన్ త్వరన్
కుండలించి వైరిమండలమ్ములన్
పిండిసేయరండు రండు రండు రండికన్

అనుచుపొంగి నిజామ్ముధాత్రిపుడు వీరావేశసంపూర్ణభా
షణచాతుర్యయుతిన్ నవీనకదనోత్సాహప్రరోహంబులన్
తనయోధాళుల యాత్మసీమలను సంస్థాపించుయత్నంబు దా
నొనరంజేసెనుగాని ద్రావితచయంబుప్పొంగె రెండింతలై

గతజలసేతుబంధనముకైవడి, నేడసమక్షకాహళా
తతనినదంబురీతి, దృషదంతరవాపితబీజమట్లు, వి
స్తృతలవణార్ణవోర్మికల జిక్కిన క్షౌద్రపృషంతులట్టులా
యతనములెల్ల నిష్ఫలములై చన యోధులగ్రమ్మఱింపగన్

చండజవంబగు ఝుంఝుకులోబడి
ఖండములై చను ఘనములవోలెన్
బండలపై కడుబలముగ బాదిన
కుండలవోలెన్ గుంఠితమతులై
దండలరాగన్ ధ్వజినీపతులున్
మండలపతులున్ చండజవద్రవ
పాండితిమీరంబాఱె నిజామున్

ఆపగనుండివెల్వడు శతాధికకుల్యలవోలె బారులై
రూపఱ శౌర్యధైర్యములు, రొప్పుచురోజుచు బాఱివారు సం
ధ్యాపటి ధాత్రిగప్పుసమయానకు గందనవోలు దుర్గపుం
బ్రాపునుజొచ్చి కాంచిరి నవాహవశౌర్యనిరంకుశత్వమున్

చండతరప్రతాపమున శాత్రవవీరుల వెంటనంటి తా
నండగరాగ నల్పమగు నాహవపండితవర్గ మాంధ్రభూ
పుండునుజొచ్చెదుర్గమును;పూర్ణజయంబునుగాంచకుండ ద్విట్
ఖాండవదాహకుల్ మఱలగ్లుదురే రణమధ్యమందునన్

కాని యాచొఱవ ప్రమాదకలితమయ్యె
అల్పబలయుతుం డాంధ్రేశుడంచు నరసి
నారు; వెంటనే బిగియించినారు; మ్లేచ్ఛ
భటులు దుర్వారదుర్గకవాటములను

అంతలో కొల్లలుగ నితరాంధ్రయోధు
లటకు నేతెంచినారు; దుర్గారంబు
లర్గళాకీలితములౌట నరసినారు;
ప్రభునిదుర్గతి కెంతయో వగచినారు;
సేతలెఱుగక బయటనే చిక్కినారు;

ప్రాలేయగిరితుంగ పాషాణనిర్మిత
ప్రాకారకుడ్యంబు ప్రాకలేక
అల మృత్యుదేవతాతుల భయంకరజిహ్వ
కలబోలు తల్పులం గడువలేక
యమకిరీటంబులో యనమించు బురుజులం
గల వైరిభటధాటి నిలుపలేక
ఘనఫణంబులబోలు గవనుకొమ్మలనుండి
పడుచిచ్చువాన సైపంగలేక

ఒదవు ప్రాణినష్టమ్మున కోర్వలేక
ప్రభుని మృత్యుదంష్ట్రిలబెట్టి పాఱలేక
ధాటి విరమించి యాంధ్రులు కోటకనతి
దూరమునగూడి యోచింపదొడగిరిట్లు

అల్పబలాన్వితుండగుచు నక్కట! భూపతి చిక్కె శాత్రవా
నల్పచమూసమూహగహనాంతరమందున, నెట్లొ దుర్గపుం
దల్పులజీల్చి యాతనికి దద్దయు దోడగుటుండె, లేనిచో
గోల్పడి శౌర్యధైర్యములు గొబ్బున బాఱుటయుండె మన్నికై

రెండే మార్గములుండెను
రెండవమార్గమగు నతినికృష్టము; పెనురా
గుండున బీయూషంబును
బిండుటవంటిదియగు దొలివిధమున్ దలపన్

అనుచు గర్తవ్యమూఢులై మనములదుర
యోజగావించు సోదరయోధగణము
నరసి నిరుపమానధృతిసమంచితాత్ము
డగుచు హనుమప్పనాయకుం డనియెనిట్లు

"సోదరులారా ! యీని
ర్వేదవితర్కంబులేల ? గ్రీష్మార్చిష్మ
త్సోదరవిక్రాంతి నమి
త్రోదరముల గాల్చుటొకటె యుక్తముగాదా !

వీరులు; స్వామిరక్షణ పవిత్రకళా నిరతాంకితాంగధీ
సారులు; సద్వివేకపథచారులు; శాత్రవరాక్షసాటవీ
చారులు; త్యాగయోగగుణసారులు; నంధ్రధరాసతీ శుభం
కారులు నాదుయోధులని క్ష్మాపతి యాత్మను నమ్మియుండగన్

వీకను వీటిబుచ్చి పృథివీశుని దుర్కల నోటబెట్టి, ని
ర్భీకముజేసి యాంధ్రధర, జివ్వను బాఋటకంటె నున్నదే
లోకవినింద్యమైనపని ? లోభములేటికి రేపొమాపొ కా
రాకులవోలె రాలు తనులాంధ్రధరార్థము నేడెరాల్పగన్ ?

మనపై నిల్చెను యావదాంధ్రజనతా మానావమానంబు లీ
యనిలో గెల్చితిమేని నిల్చునిలలో నాంధ్రాళికీర్తిధ్వజం
బినతా రేందువులుండుదాక, నజయంబే చివ్వ బ్రాప్తించినన్
జినుగుం దెగ్గుయశఃపతాక పరదాసీత్వప్రవర్గుంర్గూహతిన్

మనభుజదండంబుల దమ
మనుగడ నిడికొన్న వృద్ధమాణవకస్త్రీ
జనముల యవనాసికి బలి
యొనరించి సుఖంబున నిలనుండంగలమే ?

పాటలీపురి నాంధ్రపాలనమ్మును నిల్పు
శాతకర్ణులనాటి సంగ్రామపాటవంబు
దిగ్దంతిముఖములన్ దిగ్జయోదంతముల్
విలిఖించు గాకతీంద్రులనాటి విక్రమంబు
పంచపాండవులట్లు పరిపంథిమంథన
ప్రవణులౌ పల్నాటివడికాంధ్ర ప్రాభవంబు
కుండలీంద్రములట్లు క్రూరయవనానీక
ముల మ్రింగు కృష్ణరాయలచమూసాహసంబు

పెంపుగావింప నిత్యాభివృద్ధిగాంచి
సర్వజగతికి నీర్ష్యాభిజనకమైన
తెనుగువిభవంబు గాపాడుకొనగలేని
అసువులేటికి యోచింపు డన్నలార !

తుంభద్రానదీ తోయవల్లికలట్టు
లుల్లముల విజిగీష వెల్లువగుగాత !
శ్రీవిరూపాక్ష ఘంటావిరావములట్లు
క్ష్వేడముల్ గడలందు బిక్కటిలుగాత !
విద్యాపురీ వప్రవిస్ఫురద్ధ్వజరీతి
ఘనరణోత్సాహంబు వినుదాకుగాత !
విశ్వనాథుని స్వామివిశ్వాసమునుబోలి
డెందముల ప్రభుభక్తి ద్విగుణమౌగాత

భవ్యకృష్ణరాయాధిభూపాదకటక
కీలిత యవనరాడ్ప్రతిమాళి యగుత !
అస్మదీయాహవోద్యుక్తి కమరునట్టి
ఉత్తమోదర్కముందెల్పు పుత్తలాళి !

ఎత్తిసకత్తి దింపక యహీనపరాక్రమదీప్తి వైరిభూ
భృత్తులకుత్తుకల్ దరిగి, ప్రీతునొనర్పుడు శ్రాద్ధదేవునిన్
కుత్తుకబంటిగా విపద గూరుకపోయిన జేనికండయై
యెత్తుడు కంచనోలుపయి నిమ్మగ దెల్గులవై జయంతికల్

అనుచు దాసంత్రుటితహస్తు డగుటకతన
సమరమున బాల్గొనంగ నశక్తుడయ్యు
నభినవాయోధనోత్సాహ మాంధ్రవీరు
లందు నెలకొల్పుచున్ హనుమప్పవలుక

రాకాంభోధి విధంబున
నాకూతంబులు సెలంగ నవ్యాహతవీరో
త్సేకముతో, దనువులు వ
ర్షాకాలక్షేత్రములటు సంపులకితముగాన్

తెలుగుచమూసమూహములు తేటపడం బ్రభుభక్తియుత్తమం
బులు, హిమవన్నగోపమ సమున్నతదీర్ఘ కఠోరగాత్రముల్
బలజితదిగ్గజంబులగు బంధురసింధురకుంభసీమలం
బొలపముమీర గాఢముగబూన్చి యయఃకృతపీనపట్టముల్

సురద్రావించి, తదీయ
ద్విరదేంద్రంబుల నొనర్చి తీవ్రోన్మత్తబలో
ద్ధురములుగా, నుసికొల్పిన
నలవలలొనరింపగ వరణారరములనంతన్

చరదచలేంద్రసంతతులచందము బారులుదీఱి యొక్కకుం
జరము కవాటయుగ్మకము స్ఫారబలోద్ధతి గ్రుమ్మివెన్కకున్
దిరిగెడులోన వేఱొక యనేకప ముద్ధతిదాకి క్రుమ్మినన్
నెఱియలువాఱి చండతరనిస్వనసంయుతి వ్రీలె దల్పులున్

వారని వర్షధారలకు భంగమునందిన వారిబంధమున్
స్ఫారతరప్రకంపన విపాటితమైన ధరిత్రిగోళమున్
భారము నోపజాలక గుభల్లునగూలిన యద్రిసానువున్
వారక బోలుచావరణ బాధకవాటము వ్రయ్యలై చనన్

అంత గండిలోనుండి యత్యంతవేగ
వంతముగ జారుకొను వారిభంగి దోప
గవను గమియించి యాంధ్రభూకాంతుసేన
నేలయానినయట్లు లోనికిని జొచ్చి

భానుసమానతేజుడయి స్వల్పబలాన్వితుడయ్యు శాత్రవ
శ్రేణుల మేనులాహుతిగజేసి కృతాంతుని దృప్తుజేయుచున్
బూనికమీర బోరు *నలభూపతి జేరగబోయి చయ్యనన్
రాణదలిర్పగా తురకరాణువల న్వలయించి పోరినన్

ఆయువుచెల్లె నెందఱికొ యావనసైన్యమునందు, నాంధ్రభూ
నాయకమౌళికిం గలిగె నవ్యతరంబగు స్వేచ్ఛ, యంతని
శ్శ్రేయసమబ్బు నందఱికి శీఘ్రమె పాసి యరాతిదుర్గమున్
స్వీయకుటీరపాళికల జేరిసనంచు దలంచి సోముడున్

హరిణసమూహమున్ భయసమాకులితంబుగజేసి స్వీయకం
దరమునుజేరు శ్వాపదగణాధిపుచందముజేరె స్వీయసుం
దరశిబిరాంతరమ్ము నిరుదండల వ్యాఘ్రకిశోరసన్నిభుల్
శరధిసమానధైర్యులగు సద్భటు లాదృతిజేరిసాగగన్

---

* నలభూపతి = నలసోమభూపతి

తెనుగున్నృపాలచంద్రముని తేకువ యింగలమై దహింపగా
తనువులనాత్మలన్, యవనధాత్రిపు లామఖునాడుగూడి యా
యనువున యోజచేసిరి, "మహాబలసంయుతిదాక నొక్కనా
టను పరిభూతుడై మనపదంబుల ప్రాలును సోకుడంచు యో
జనయొనరించి వచ్చితిమి; సర్వముబాసితి మక్కటాయనిన్

చెల్లిరి మూడులోకముల శ్రీవహియింపగజాలు వీరులా
బళ్ళరినాయక ప్రముఖ పార్థివులెందఱొ! సైన్యమందునం
ద్రెళ్ళెను మూడుభాగములు; తేకువలాతెను దక్కసేనలో
చెల్లదువో జయంబు గొన జివ్వను నీస్థితి నెవ్విధంబునన్

వైరులమయ్యె నాంధ్రజనపాలునిస్థేమము, గార్యదీక్ష, ద
ద్వీరవరూథినీ మహితవిక్రమముం గొసియాతకుండగా
నేరము; స్థేమమెవ్వరిదొ నిక్కముగా జయలక్ష్మి వారిదే,
వారక సంధిగూర్చుకొనవర్తిలుటే నయమాన్నృపాలుతోన్

మాటలు పెక్కులేటికి? అమానుషవీరుడు సోమనాద్రి, మో
మోటలుమాని యావిభుని ప్రోలకు నిప్పుడె పంపగాదగున్
మాటలపొంకముంగలుగుమానిసి నొక్కని సంధిసేయ, సం
స్ఫోటముమాన్పి యస్మదసువుల్ పరిరక్షణసేయగానొగిన్"

సంధియత్నంబు తనకనిష్టంబెయయ్యె
గుయ్యెడికయింత తలయూచె సయ్యదుండు
నయముచే లొంగని ఖలుల నడతదీర్చ
భయమె యద్వితీయౌషధం బగునుగాదె !

వైరులంపిన రాయబారమ్ము నాలించి
వాహినీపతి మంత్రివరులతో జర్చించి
ఆంధ్రభూపతియంత నాశ్రవము సూచించె
సంధిమెత్తురుగదా శాంతికాముకులెందు !

ఆదోనికందనోలపసీశులకు జెంచు
ధరయందు భాగంబు దానుబొందె
గోనబుద్ధారెడ్డి గోత్రేశ నిర్మితం
బులు, రాయచూర్పురీ భూమిపాల
వరణస్థితంబులౌ వరరామలక్ష్మణా
హ్వాయ శతఘ్నిద్వయ ప్రాప్తినందె
కర్నూలుదుర్గానగల్లు కొండారెడ్డి
క్రొత్తశంబున కలంకృతిగనున్న
యెల్లమాహ్వాయమైన బల్లివంపుఫిరంగి
గలహంపు బణముగా గాన్కనొందె

ఘనసపత్నాధిభూ రత్నఖచిత ఖడ్గ
సంతతుల, బహువిధమణి స్వర్ణభూష
ణాదుల నుపదగానొందె నాంధ్రవిభుడు
సంధిషరతులక్రింద మ్లేచ్ఛాళినుండి

ఈపగిదిన్ జయలక్ష్మీ
ప్రాపితవక్షుడయి యాంధ్రరాణ్మణి గద్వా
లాపురి సమరావతి లే
ఖాపతిచందమున డాసి ఘనమోదమునన్

మునుముందుగా నిస్సహణ శంఖ దుందుభి
స్వనముతో వాదిత్రగణము నడువ
పైని, "యవనాటవీపావకా ! బహుపరాక్
నలసోమ!" యని వందికులము పాడ
మీద గజవాజితతిమీద విస్ఫురితాస్త్ర
పాణులై బహువీరవరులు వోవ
ఉపరి నానావిధాయుధ కనత్పాణులై
కాల్బలమ్ములు శ్రేణిగట్టి సాగ

రణవిజయకారణంబైన రమ్యభద్ర
సైంధవోత్తమాసీనుడై సరస నొక్క
వారువముమీధ హనుమప్ప చేరిసాగ
నగరిజొచ్చె నాంధ్రావనీనాయకుండు

నరనారాయణులట్టుల
పురముంజొచ్చిన హనుమపభూమీవిభులన్
బరికించి ముదంబున బొం
దిరి యనిమేషత్వము జననివహములంతన్

అతడటే ! ఓయక్క ! ఆంధ్రీముఖంబునన్
ఘుసృణంపు దిలకంబు గూర్చువాడు !
ఇతడటే ! నెచ్చెలీ ? క్షితినాథు కోసమై
హస్తముం బలిచేసినట్టి దిట్ట!
చూచితే ! ఓతండ్రి ! క్షుద్రయవనేశులం
బ్రుంగించి లోకముం బ్రోచుతేని !
వీక్షించితేనాథ ! విజయకారణమైన
యశ్వముం గొనితెచ్చినట్టివాని !

ఆంధ్రధర గావ బ్రభవంబు నందియున్న
కట్టికవ్వడులే వీరు కుట్టిలార!
ఆంధ్రవిభవంబు గావంగ నవతరిలిన
రామహనుమంతులే వీరు రామలార!

అని విస్మయగర్వకలిత
మనోంబుజాతులయి ప్రజలు మన్ననసేయన్
కనకలతాంగులు క్రొన్నన
లను గురిపింపగ భవనతలాంచితులగుచున్

చనుదెంచెడు విభునిన్ వా
హిని నాహ్వానించెను వరకృష్ణాపగ, వ
క్త్రినళిననిర్యద్భృంగీ
గణముల స్వాగత మనోజ్ఞగానములెసగన్

శీతలకృష్ణాతటినీ
వాతములంబుజసుగంధపరిణద్ధములై
వీతమొనర్చెను ప్రస్థా
నాతపమున్ వాహినికిని నవనీపతికిన్

తిరుమలవంశవార్ధిశశి, ధీరవిధేయుడు, భారతీకృపా
వరవిదితాంధ్రవాక్సరణివై భవు, డిద్ధఖగోళశాస్త్రమం
దురుగుణసంపుశాస్త్రమున నుజ్జ్వలశేముషికల్గువాడు, శ్రీ
కరమగు నుత్తరామెరికఖండనివాసియు నైనవాడునున్

శ్రీకృష్ణదేశికాఖ్యుడు
శ్రీకరముగజెప్పె దీని శిష్టాంధ్రచరి
త్రాకాశనభోమణి, లో
కైకయశోఘృణియగు హనుమప్ప చరిత్రన్

## సవరణపట్టిక – 1

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| xxxviii | 24 | వాడదామె | వాడమె |
| xxxviii | 24 | నాత్మనునన్ | నాత్మను దానన్ |
| xxxix | 20 | సత సద్వర్తన | సతతసువర్తన |
| xxxx | 16 | వాక్పొరకును | వాక్సొరకును |
| 8 | 19 | దరియించు | దాటించు |
| 19 | 5 | మేల్లులు | మేల్లుల్కు |
| 20 | 15 | గాధ | గాథ |
| 20 – 13 నుండి 20 పంక్తులేకంగాచదువుకోండి. | | | |
| 20 | 14 | మయారంబు | మయూరంబు |
| 20 | 17 | విహరమాన | విహరమాణ |
| 20 | 19 | కోడ్డినమాన | కోడ్డీయమాన |
| 25 | 2 | ఘరునాగ | ఘటనాగ |
| 26 | 14 | బుల్కులస్ | బుల్కులన్ |
| 27 | 11 | ధర్మనం | దర్మనం |
| 29 | 11 | మూర్థము | మూర్ధము |
| 29 | 18 | స్నిగ్థతర | స్నిగ్ధతర |
| 30 | 9 | వర్థమాన | వర్ధమాన |
| 31 | 8 | గుణుడేనని | గుణుడానని |
| 33 | 2 | గనిమె | కనిమె |
| 35 | 3 | తురగమ్మ | తురగమ్ము |
| 36 | 14 | సిద్థహస్తుని | సిద్ధహస్తుని |
| 38 | 18 | అవరోథ | అవరోధ |
| 38 | 21 | దరిమించు | దాటించు |
| 40 | 8 | జీవురుగొమ్మ | జీవురుగొమ్ము |
| 40 | 19 | దవిన | దవిలిన |
| 40 | 20 | గడ్డము | గడ్డము |
| 41 | 8 | లాడింవగలెన్ | లాడింపవలెన్ |
| 43 | 12 | పెమనుర్గులం | పెనునుర్గులం |
| 43 | 13 | హనుమవ్వ | హనుమప్ప |
| 45 | 2 | యులనించినావు | యిలనించినావు |

## సవరణపట్టిక – 2

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 47 | 4 | రమ్యమై | రమ్యమై |
| 48 | 7 | ఘామరచత | ఘామారచిత |
| 49 | 13 | నస్పురిగన | నప్పురిగని |
| 49 | 14 | నీర్శ్యస్ | నీర్శ్యన్ |
| 50 | 4 | నాథుస్ | నాథున్ |
| 50 | 6 | బొధ | బాధ |
| 50 | 8 | యదరుసాబు | యిదరుసాబు |
| 50 | 16 | సేయస్ | సేయన్ |
| 51 | 8 | సమదుడాప్త | సమ్యుదాప్త |
| 53 | 3 | దోపల | దోటల |
| 54 – మొదటి 12 పంక్తులేకంగా చదువండి. | | | |
| 56 | 10 | స్దలులందు | స్థలులందు |
| 57 | 12 | యూధముల | యూథముల |
| 57 | 14 | సముద్థారణ | సముద్ధారణ |
| 58 | 3 | దోర్థ్వితయా | దోర్ద్వితయా |
| 58 | 14 | దృబ్థ | దృబ్ద |
| 59 | 13 | వర్ణంచితోష్ణిష | వర్ణాంచితోష్ణిష |
| 59 | 17 | సప్తపర్వత | సప్తిపర్వత |
| 62 | 1 | స్వాతిశుభ | స్యాతిశుభ |
| 63 | 5 | ఊర్థ్వపుండ్ర | ఊర్ధ్వపుండ్ర |
| 64 | 19 | అర్థాంగి | అర్ధాంగి |
| 66 | 6 | దివాన | ద్రిదివాన |
| 66 | 9 | మహింధ్రము | మహీధ్రము |
| 66 | 19 | గడిత | గరిత |
| 68 | 5 | పినద్థ | పినద్ధ |
| 69 – మొదటి 8 పంక్తులేకంగా చదువుకోండి. | | | |
| 69 | 16 | వైదుదగ్ధ్యంబు | వైదగ్ధ్యంబు |
| 69 | 20 | విద్వష్టుద్గోల | విద్వద్గోష్ఠుల |
| 71 | 13 | ప్రన్నసే | ప్రన్ననొ |
| 72 | 3 | గొట్టుచుచున్ | గొట్టుచున్ |

సవరణపట్టిక - 3

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 72 | 6 | బహూప్రస్తుతింప | బహూధాస్తుతింప |
| 72 | 7 | ఆపైన | ఆపైని |
| 73 | 2 | జనవార్థి | జనవార్ధి |
| 73 | 3 | సంసక్తి | సంసక్త |
| 75 | 20 | క్రమ | క్రమ్రు |
| 76 | 11 | సిద్థించె | సిద్ధించె |
| 76 | 17 | హనుమవ్వ | హనుమప్ప |
| 78 | 6 | వెనుదిరిగె | వెనుదిరిగి |
| 78 | 6 | ఖేదించి | భేదించి |
| 78 | 16 | హిస్తికాలయు | హాస్తికాలయు |
| 79 | 3 | వృథ్థి | వృద్ధి |
| 79 | 8 | మత్తి్రకా | మృత్తికా |
| 81 | 17 | వీధి | వీథీ |
| 87 | 12 | పృ్వథీవరు | పృథ్వీవరు |
| 87 | 16 | అస్దాన | అస్థాన |
| 88 | 20 | మిన్కుమిన్కు | మిన్కుమిన్కున |
| 89 | 3 | నయ్యుడుడని | సయ్యుడుడని |
| 89 | 18 | సూనోపమ | సూనూపమ |
| 90 | 6 | యూధముల | యూథముల |
| 90 | 17 | ; నది | ; నరి |
| 91 | 11 | మోథధి | మోదధి |
| 95 | 1 | స్మైశు | శ్మైశు |
| 98 | 1 | కండలీకృత | కుండలీకృత |
| 107 | 15 | పరిక్షరణ | పరిరక్షణ |
| 109 | 11 | థవిము | విథము |
| 113 | - | 4 నుండి 12 పంక్తులేకంగా చదువుకోండి. | |
| 117 | 15 | చొాప్ప | చొప్ప |
| 123 | - | మొదటి 9 పంక్తులేకంగా చదువుకోండి. | |
| 140 | 17 | తేజవిభాస | వేగవిభాస |

సవరణపట్టిక - 4

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 140 | 20 | మనోపమాన | మనస్సమాన |
| 145 | 2 | వాసప! | వాసవ! |
| 145 | 13 | స్థిరవర్థమాను | స్థిరవర్ధమాను |
| 153 | 6 | తేకుప | తేకువ |
| 159 | 2 | మెగములందు | మొగములందు |
| 160 | 4 | మతులై | ధృతులై |
| 161 | 2 | దుర్గారంబు | దుర్గారరంబు |
| 162 | 20 | రాకుల | రాకులు |

సవరణ పట్టిక – అనుబంధము

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది | పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|---|---|---|
| XXXV | 2 | రసంబులు | రసంబుల | 80 | 10 | ల్లాక్రమించగ | ల్లాక్రమింపగ |
| 4 | 11 | ముహూర్తనమున | ముహూర్తమున | 87 | 2 | గూలినిన్ | గూలినన్ |
| 7 | 12 | రజస్సత్వ | రజస్సత్త్వ | 89 | 17 | తెలియంగ | తెలియగ |
| 7 | 13 | ముంగిట్ల | ముంగిటన్ | 90 | 23 | కాపుఘారము | కావుఘారము |
| 10 | 13 | నాయనవారా | నాయనలారా | 95 | 2 | సంన్నిగ | సంన్నిగ్ధ |
| 10 | 19 | సంద్రవు | సంద్రపు | 96 | 16 | తేజవిస్ఫూర్తి | తిగ్మకరకాంతి |
| 13 | 18 | వోలె | బోలె | 99 | 5 | వోలె | బోలె |
| 17 | 21 | ఇనన్ | ఐనన్ | 100 | 15 | ననిపించగ | ననుపంగా |
| 18 | 16 | శ్రాంతించె | శాంతించె | 102 | 10 | మహిమేస్లాం | మహేస్లామిక |
| 19 | 4 | తగబారులా | తగుబారులా | 102 | 14 | ద్రుంచగ | ద్రుంపగ |
| 25 | 6 | నించగ | నింపగ | 103 | 11 | వోలెఁ | పగిదిఁ |
| 25 | 9 | బురుడించగ | బురుడింపగ | 117 | 4 | పతులఁ | పతులుఁ |
| 25 | 12 | లాలికించగ | లాలికింపగ | 128 | 19 | అనుచు | అనుచు |
| 27 | 13 | సత్వుండు | సత్త్వుండు | 132 | 19 | యాపదల | నాపదల |
| 27 | 12 | సత్వమున | సత్త్వమున | 135 | 3 | వినమజ్య | వినిమజ్య |
| 31 | 13 | కాముదులే | గాముదులే | 137 | 6 | హింనల | హింసల |
| 35 | 17 | కుప్పించి | గుప్పించి | 137 | 20 | యాతడాంధ్రుడే | యాంధ్రుడాంధ్రుడే |
| 40 | 14 | చెక్కళు | చెక్కిళు | 138 | 19 | సంవృక్ణ | సంవృక్ణ |
| 43 | 18 | యతనిమై | యతనిమైఁ | 145 | 18 | వోలె | బోలె |
| 45 | 19 | శాద్వలంబువ | శాద్వలంబుల | 150 | 5 | తేజవిస్ఫురణ | విక్రమస్ఫురణ |
| 50 | 2 | యనియుమ | యనియును | 152 | 5,8 | యరుణమైన | నరుణమైన |
| 53 | 12 | శ్రాంతి | శాంతి | 153 | 6 | తేటవడగ | తేటపడగ |
| 58 | 14 | నూనాంచిత | సూనాంచిత | 153 | 10,12 | సత్వ | సత్త్వ |
| 59 | 8 | కైవారముల్ | గైవారముల్ | 155 | 4 | ద్యోగముసం | ద్యోగమునం |
| 63 | 17 | తారావిధి | దారావిధి | 155 | 16 | తేజోద్ధృతమై | తేజోంచితమై |
| 66 | 5 | పుణ్య | బుణ్య | 158 | 20 | నెరసుల | నెరసులు |
| 67 | 2,4,6 | వోలె | బోలె | 160 | 2,4 | వోలెన్ | బోలెన్ |
| 74 | 4 | విశేషమ్ము | విశేషముల్ | 160 | 8 | కుల్యల | కుల్యలు |
| 84 | 10 | సంగములందు | సంగములందుఁ | 167 | 13 | గూర్చుకొన | గూర్చుకొని |



మా తెలుగు తల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగువిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య